2

PARLE

కత్తిరించనా!

ఒక్కటి
ఇవ్వనా?




పిల్లల జుట్టుకు కావాలి
కేవలం రంగులు గల బిళ్ళ, ఎందుకంటే ఇందులో ఉన్నాయి
ఎన్నో రకాల ఫ్లేవర్‌లు అందరికీ ఇవ్వాలని అనిపిస్తుంది.

**అపుడు పాప్-ఇన్ చేస్తుంది పాపిన్స్**
**మరియు అనండి, 'ఒక్కటి ఇవ్వనా?'**

everest\PB\242-12 tel



# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## చిన్నారి చిత్రకారిణి

శైలేంద్ర భట్నాగర్, వినీతా భట్నాగర్‌ల ప్రియపుత్రిక అరుషి భట్నాగర్. 11నెలల వయసులో తన తొలి ప్రదర్శనలో ఉజ్జయినిలోని కాళిదాసు అకాడెమీలో 52 చిత్రాలు గీయడం ద్వారా ఈ చిన్నారి బాల చిత్రకారిణిగా గిన్నెస్ వరల్డ్ రికార్డ్ కెక్కింది. ఇప్పుడు అరుషికి ఎనిమిదేళ్లు. ఇప్పటికే తను 3 వేలకు పైగా చిత్రాలను గీసింది, 1500 ప్రదర్శనలు నిర్వహించింది. 9 అవార్డులు, 23పతాకాలు గెల్చుకుంది. ఈమె రూపొందించిన నాలుగు కళా చిత్రాలు అమ్ముడుపోయాయి కూడా. 2005పోగో అద్భుత చిన్నారుల అవార్డు పోటీల్లో రెండవస్థానం సాధించిన అరుషి ఈ పోటీలో పాల్గొన్న అత్యంత పిన్న వయస్కురాలిగా పేరొందింది. ఏడాది వయసులో భోపాల్‌లో రాష్ట్రస్థాయి పోటీలో మొట్ట మొదటి అవార్డు ట్రోఫీ సాధించినదీ చిన్నారి. హైదరాబాద్‌లో జరిగిన చైల్డ్ ఆర్ట్ క్లబ్ టోర్నీలో స్వర్ణ పతకం సాధించింది.

బాలలదినం సందర్భంగా భారత రాష్ట్రపతి ఆమెను సత్కరించారు. సిబిఎస్ఇ కోర్స్ నాలుగవ తరగతిలో అరుషి విజయాల గురించి ప్రచురించారు.

భోపాల్ లోని రేఖాంఖన్ కళా సంస్థాన్ ద్వారా తన చిత్రాలను అమ్మగా వచ్చిన ఆదాయాన్ని ఈ చిన్నారి మూగ, బధిర పిల్లలకు అందించింది. విజయసాధనకు వయస్సు అడ్డురాదని అరుషి తన చిన్నజీవితంలోనే నిరూపించింది. ఈ చిన్నారికి ఉజ్వల భవిష్యత్తు కలగాలని చందమామ ఆకాంక్షిస్తోంది.



July 2012 ₹25/-
*Founded by B. Nagi Reddi and Chakrapani*

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Customer Help :**
Ph: 022 40786043
customerhelp@chandamama.com

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 July 2012 Issue-07

# అవ్యవస్థత.. మరింత అవ్యవస్థత...!

మనం 2012 సంవత్సరంలో సగం కాలాన్ని అప్పుడే దాటేస్తున్నాము. సంవత్సరం ప్రారంభంలో కంటే ఇప్పుడు పరిస్థితి మరింత గందరగోళంగా కనిపిస్తోంది. ప్రపంచ స్థాయిలో మాంద్యం, ఆర్థిక సంక్షోభం ప్రత్యేకించి యూరప్‌లో మునుపు ఎన్నడూ లేనంత అపనమ్మకాలను ప్రతి ఒక్కరిలో కలిగిస్తోంది. భారతదేశంలో కూడా డాలర్‌తో పోలిస్తే రూపాయి విలువ దారుణంగా పడిపోవడంతో కనీ వినీ ఎరుగని ఆర్థిక సంక్షోభాన్ని మనం చూస్తున్నాము. అధిక ద్రవ్యోల్బణ రేట్లు సామాన్యుడి జీవితాన్ని కనాకష్టంగా మారుస్తున్నాయి. ఈ కష్టకాలంలోనే మనం బలం పుంజుకుని సమస్యలను ఎదుర్కోవాలి. వీటిని అధిగమించినవారు సకాలంలో సత్ఫలితాలను పొందగలరు, దేశం కూడా శక్తిమంతంగా ఆవిర్భవించగలదు. మనం భారతీయులుగా ఇలాంటి సమస్యలను సమర్థవంతంగా ఎదుర్కొనగలం. మన సంస్కృతి బోధనలు, మన నైతిక విలువలే దీనికి కారణం. చందమామ కథల ద్వారా మా పాఠకులకు ఇవే విలువలను అందించడానికి శతథా ప్రయత్నిస్తున్నాము.

ఈ పరిస్థితుల్లో మన జీవనశైలులను తిరిగి మదింపు చేసుకోవాలి. అప్పుడే మనం అప్పుల ఊబిలో చిక్కుకుని పోకుండా ఉండగలం. గత కొన్ని ఏళ్ళుగా మనం అధికంగా ఖర్చుపెట్టడానికి అలవాటు పడిపోయాము. దీన్ని ఇప్పుడు తగ్గించుకోవాల్సిన పరిస్థితి వచ్చేసింది. జాతీయ స్థాయిలోనూ, వ్యక్తిగత స్థాయిలో కూడా ఇది అనివార్యం. ఖర్చులను అదుపులో పెట్టుకుని మరింత ఆదా చేసుకునే వాళ్లే తక్కువ సమస్యలతో అధిగమించగలరు. మన దేశం ప్రస్తుత సంక్షోభం నుంచి బయటపడి మరింత శక్తిమంతంగా మారగలదని మా విశ్వాసం.

గత నెల సంపాదకీయంలో తెలిపినట్లుగా, మా అదుపులో లేని పరిస్థితుల కారణంగా, నష్టాలను తగ్గించుకోడానికి మా పత్రికల ధరలను కాస్త పెంచక తప్పడం లేదు. మేం ఎదుర్కొంటున్న ఈ క్లిష్ట పరిస్థితిని, మేం చేపడుతున్న చర్యలను మా పాఠకులు అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాము, ఎప్పటిలాగే మీరు పత్రికను ఆదరించాలని వినమ్ర పూర్వకంగా కోరుకుంటున్నాము.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



చందమామ ప్రతిభ మనరాష్ట్రం, దేశం కాకుండా ఎల్లలు దాటి విదేశాలకు వెళ్లింది. గత సంవత్సరం దుబాయికి వెళ్లాను. అక్కడ మా పాప, అల్లుడు ఇంజనీర్లుగా పనిచేస్తున్నారు. నన్ను రమ్మంటే ఆరు నెలలు ఉండి వచ్చాను. ప్రతినెల పేపరు ఏజెంటుతో గొడవే. 'చంద మామ అడిగితే కాపీలు అయిపోయాయి' అంటాడు. దుబాయ్‌లో లక్షల్లో తెలుగు వారుంటే అక్కడికి చందమామ కొద్ది కాపీలే పోతున్నాయట. అందుకే ఓ పది కుటుంబాల వాళ్లు ఒక చందమామను కొని వంతులవారీగా చదువుతున్నారట. మా మనుమలు ప్రతినెల చంద మామ తీసుకురమ్మని నన్ను వేధించేవారు. మరి పేపర్ ఏజెంట్ పరిస్థితి అది. అందుకే మా అల్లుడిని సంవత్సర చందా కట్టి చందమామ కాపీ తెప్పించుకోమని చెప్పాను. చందమామలో ప్రతి పేజీ పాఠకులకు ఎంతో ముఖ్యం. పిల్లలే కాదు పెద్దలు కూడా చాలా శ్రద్ధగా చదువు తారు. మళ్లీ ఫోటో వ్యాఖ్యల పోటీ ప్రారంభించండి.

– పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్

మే నెల చందమామ సంచిక చాలా ఆలస్యంగా వచ్చింది. రెండోవారం చివరలోనే పత్రిక అందింది. ఆలస్యంగా వచ్చినా పత్రిక చేతుల్లో పడగానే అదే మమకారం, ఆదే అనుభూతి. చందమామ రచయిత్రిగా నన్నూ చేర్చుకున్నందుకు సంతోషం. నా కథ ఎప్పుడు అచ్చయినా నాకు 12 భాషల చందమామలు కావాలి. ఈ ఏర్పాటు మీరు చేస్తే నేను ముందస్తుగా కూడా డబ్బు పంపగలను. ఒక్కటి మాత్రం నిజం. చందమామ కథల ఎంపిక ప్రక్రియ అద్భుత మైందని నా అభిప్రాయం. దశాబ్దాలుగా దేశమంతా 12 భాషల్లో పాఠకులకు నచ్చేలా, మెచ్చేలా కథలు అందించడం అంటే చిన్నమాట కాదు. కథ, చిత్రాలు పత్రికకు ప్రాణం పోయవచ్చు కాని ఏ కథను ఎంపిక చేస్తే పాఠకులు మెచ్చుతారో గ్రహించి అందరికీ నచ్చే కథల్నే ఎంపిక చేయడమే చందమామ విజయరహస్యం. చందమామ కథలు ఎలా ఎంపిక చేస్తారో బయట మాకెవ్వరికీ నిజంగా తెలియదు కాని ఆ ఎంపిక మాత్రం వంకలు పెట్టలే నిది. గతంలోనూ, ఇప్పుడు కూడా చందమామ కథల ఎంపిక ప్రక్రియలో పాలుపంచుకుం టున్న వారందరికీ అభినందనలు. – డాక్టర్ సిరి, మిర్యాలగూడ, నల్గొండ, ఎ.పి.

నేను ప్రస్తుతం వేదాధ్యయనం చేస్తున్నాను. మే నెల చందమామను చదివాను. అందులో కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా 'అప్పు తెచ్చిన ముప్పు', 'పనిదొంగ', 'ఇచ్చేగుణం' కథలు చాలా బాగున్నాయి. ఈ నెల పత్రికలోని ఆరు చిన్న కథలూ బాగున్నాయి. 'దయ్యం వదిలింది' కథ ఆలోచనాత్మకంగా ఉంది. అలాగే ముఖచిత్రం అట్టవెనుక వేసిన వపాగారి బొమ్మలు చాలా బాగున్నాయి. – వి. ఆర్. సుబ్రహ్మణ్యం, విజయవాడ, ఎ.పి.

గత 40 ఏళ్లుగా చందమామ చదువుతున్నాను. మే నెలలో కథలన్నీ బాగున్నాయి. చాలా కాలం తర్వాత చందమామలో జంతువుల కథను ప్రచురించారు. దాసరి సుబ్రహ్మణ్యం

గారు టి.శంభుదాసు పేరుతో గతంలో ప్రచురించిన జంతువుల కథలను కొత్తతరం పాఠకుల కోసం తిరిగి ప్రచురించండి. – వి. సీతారామరాజు, గొరగనమూడి, పశ్చిమ గోదావరి, ఏ.పి.

చందమామలో మళ్లీ తాతయ్య కథలు వేస్తున్నారు. సంస్కృత-శ్లోకం ఆధారంగా చక్కటి నీతి బోధనను తాతయ్య ద్వారా పిల్లలకు అందించిన గొప్ప కథలివి. 'దేవుడు కర్రలోనూ, రాతి లోనూ, మట్టిలోనూ లేడు, మన బుద్ధిలోనే ఉన్నాడు అన్నిటికి బుద్ధే మూలకారణం' ఉంటూ ఈ నెల తాతయ్య కథ 'మోక్షార్హత'లో సార్వజనీన సత్యాన్ని ప్రకటించారు. ఒక తరం పాఠకు లపై విశేషంగా ప్రభావం చూపిన ఈ కథా రత్నాలను మళ్లీ పిల్లలకు, పెద్దలకు కూడా అందిస్తున్నందుకు కృతజ్ఞతలు. – మోహనరూప, తిరుపతి

మార్చి నెల చందమామలో వచ్చిన 'మేకు విలువ' కథను నేను దాదాపు 55 ఏళ్ల క్రితమే పాత చందమామలో చదివాను. ఆ కథ నాపై చాలా ప్రభావం చూపింది. ప్రతి చిన్న వస్తువును తర్వాత పనికివస్తుందని దాచిపెట్టడం ఈ కథ చదివిన తర్వాతే నాకు అలవాటైంది. అలా దాచిన వస్తువులు తర్వాత పనికొచ్చాయి కూడా. 68 సంవత్సరాల వృద్ధ చేతులతో భూలోకపు చందమామకు అక్షింతలు ఆశీర్వదిస్తూ.. – ఖాదర్ ఆలీ అన్వర్, శ్రీకాళహస్తి, చిత్తూరు

నేను 1967 నుంచి చందమామను చదువుతున్నాను 2012లో కొత్త సొబగులతో వస్తున్న చందమామ నా బాల్యాన్ని మరోసారి గుర్తు తెచ్చింది. ప్రతి సంచికా నాకు అమృతం లాంటింది. నా బిడ్డలను కూడా చందమామ మంత్రముగ్ధులను చేస్తోంది. చందమామ చదవటం అంటే వారికెంతో ఇష్టం. – సునీల్ ఎమ్. సకలకలె, నాసిక్, మహారాష్ట్ర

నాకు 12 ఏళ్లు, గత 5 సంవత్సరాలుగా నేను క్రమం తప్పకుండా చందమామ చదువుతు న్నాను. చందమామలో అన్నికథలూ నాకిష్టమే. బేతాళకథలు అంటే మరీ ఇష్టం. చంద మామలో యువ విజేతలు శీర్షిక నన్ను కూడా స్టార్ కావాలని ప్రేరేపిస్తోంది.

– ఇషాని చట్టర్జీ, ఖర్గపూర్, పశ్చిమ బెంగాల్

మే నెల చందమామను సకాలంలో అందుకోలేకపోవడంతో కాస్త ఆందోళన కలిగింది. చందమామ నీలిమేఘాల మాటున దాగాలనుకుందేమో మరి. ఎట్టకేలకు చందమామ ప్రకాశిస్తూ వచ్చింది, హృదయం నిండా సంతోషం నాకు. మరిన్ని పోటీలను పరిచయం చేసి మాకు ఆనందాన్నివ్వండి. – కేశవన్, ట్యుటికోరిన్, తమిళనాడు

నేను ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత చందమామలను గత 10 సంవత్సరాలుగా క్రమం తప్పకుండా చదువుతూ వస్తున్నాను. ఇతర భాషలలో ప్రచురిస్తున్న 'శిథిలాలయం' వంటి సీరియల్స్ చదివే అవకాశం ఇంగ్లీష్ చందమామ పాఠకులకు కల్పించనందుకు అలాగే వినాయకుడి కథ వంటి పౌరాణిక సీరియల్స్‌ను చదివే అవకాశం ప్రాంతీయ భాషల చంద మామ పాఠకులకు కల్పించనందుకు చాలా నిరాశగా ఉంది. ప్రాంతీయ భాషల చందమామల్లో వలె ఇంగ్లీషులో కూడా చందమామ సీరియల్స్‌ను ప్రచురించాలని నా అభ్యర్థన.

– పి.వి. శ్రీనివాస రావు, హైదరాబాద్



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ........................................................................................

Date of Birth: .................................. Sex :..........................................

Address: ........................................................................................

........................................................................................

........................................................................................

........................................................ City: ..........................................

State:......................................... Pin:............................................

Telephone:........................................................................................

Mobile:........................................................................................

Email:........................................................................................

Subscription Number (for renewals):............................................

Gift Subscription to the following address:

........................................................................................

........................................................................................

........................................................................................

........................................................................................

Enclosed Cheque/DD* for Rupees..................................................

Cheque/DD No ............................................................................

favouring Chandamama India Ltd on.............................................

........................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 30/- per copy) | Rs. 360 | Rs. 645 | Rs. 915 | Rs. 1150 | Rs. 1350 |
| You Save | | Rs. 75 | Rs. 165 | Rs. 290 | Rs. 450 |
| REGIONAL (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 260 | Rs. 375 |
| JUNIOR (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 765 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 195 | Rs. 300 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (Including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు

1947లో నేను విజయనగరంలో మూడో ఫారం చదువుతూ ఉండేవాడిని. సాయంకాలం వేళల్లో కప్పాలో రీడింగ్ రూమ్ ఉంటే అక్కడికి వెళ్ళికూచుని పత్రికలూ అవీ చూస్తూ ఉండేవాడిని. అది ఎన్‌జీఓల రీడింగ్ రూమ్. అయినా ఉత్సాహం ఉన్నవాళ్లు వస్తే అభ్యంతర పెట్టేవారు కాదు. ఆగస్టులో దేశానికి స్వతంత్రం వస్తుందని అందరూ హడావుడిగా ఉండేవారు. ఎక్కడ చూసినా అవే మాటలు! అలాగే చందమామ పేరుతో పత్రిక ఒకటి వస్తోందని, రంగురంగుల బొమ్మలు, కథలతో ఉంటుందనీ చెప్పుకునేవారు. ఆ సంవత్సరం జూలైలో చందమామ వచ్చింది. ఆగస్టు 15న మనకు స్వతంత్రం వచ్చింది. చందమామ రీడింగ్ రూమ్‌కి వచ్చింది కాని, ఎవరెవరి చేతుల్లోనో ఉండేది. అందరూ 'బాగుంది బాగుంది' అని చెప్పుకునేవారు. ఇక లాభం లేదని ఎలాగో ఆరు అణాలు సంపాదించి, పత్రిక కొనడం కోసం ఊరంతా తిరిగాను కాని దొరకలేదు. కాపీలు ఐపోయాయి అని చెప్పారు. కొన్ని రోజులకు బాగా నలిగిపోయిన స్థితిలో ఉన్నప్పుడు గాని చందమామ నాచేతికి అందలేదు. అట్టమీద వెండిరంగులో ఉన్న నెమలి, లోపలి బొమ్మలు, పెద్దక్షరాలూ, కథలతో ఏదో లోకానికి తీసుకువెళ్లిపోయినట్లు అనిపించింది. వచ్చే నెల చందమామని సొంతం చేసుకోవాలని ఆగస్టు మొదటి తేదీనుంచే పత్రికలమ్మే షాపులు చుట్టూ తిరిగాను. ఒక షాపువాడు 'వచ్చాయి కానీ ఏజెంట్ ఇంట్లో ఉన్నాయ'న్నాడు. 'ఏజెంట్ ఇల్లు ఎక్కడ' అని అడిగితే, 'రైల్వేస్టేషన్‌కి అవతల' అన్నాడు. పరుగెత్తాను. రైళ్లు వస్తున్నా లక్ష్యపెట్టకుండా, పట్టాలు దాటి అటుపక్కవెళ్లి ఆ ఏజెంట్ కోసం తిరిగి ఇల్లు పట్టుకుంటే, 'కాపీలు వచ్చాయి గాని, కట్ట విప్పలేదు. రేపు ఉదయం షాపులకు అందజేస్తాను. అక్కడికి వెళ్లి కొనుక్కోగాని నేను మాత్రం ఇప్పుడు పార్సెల్ విప్పను,' అన్నాడు. నిరుత్సాహంతో కాళ్లీడ్చుకుంటూ ఇంటికి వెళ్లి సూర్యోదయం కోసం ఎదురుచూసి, స్కూలుకు వెళ్ళేలోపల పత్రికలు అమ్మేవాడి షాపు దగ్గరకెళ్లి అడిగితే, అతగాడు రాలేదని చెబితే, ఇక లాభం లేదని అక్కడే నిలబడి ఉండగా, ఓ పదికాపీలు అందజేశాడు ఆ ఏజెంట్. అంతే, ఆరణాలూ ఇచ్చేసి, కాపీ తీసుకుని ఇంటికి పరుగెత్తి ఓ మూల కూర్చుని జాగ్రత్తగా పేజీలు తిప్పుతూ, స్కూలు ఎగ్గొట్టి మొత్తం చదివేసి, ఊపిరి పీల్చుకున్నాను. ఎవరికీ చందమామని చూపించకూడదని ఎక్కడో దాచేశాను. ఇదీ నాటి అనుభవం! ఇంక ప్రతినెలా చందమామ నా సొంతం. శుక్లపక్ష చంద్రుడిలా



Name: Ravi Kondala Rao
Occupation: Actor & Editor,
Hyderabad.

చందమామ మాసపత్రిక ప్రవర్ధమానమైంది. 1948లో తొలిసారిగా మద్రాసు వెళ్లినప్పుడు నేను ముందుగా వెళ్లింది.. జార్జిటౌన్‌లో ఉన్న చందమామ ఆఫీసుకే. అయితే నా కెవరూ ఆ ప్రింటింగూ అవీ చూపించలేదు.

1966లో నాకు అదే చందమామ పబ్లికేషన్స్‌లో ఉద్యోగం వచ్చింది. వారి ప్రచురణే విజయచిత్ర. దానికి నేను సహసంపాదకుడిని. చందమామ చేతికి అందింది. బాగా దగ్గరైంది. తర్వాత్తర్వాత, సుకుమార్ పేరుతో, ఆర్ రేవతి పేరుతో చందమామ కథలు రాశాను. బేతాళ కథలు రాశాను. చందమామ రాగానే, ఆఫీసులోని నా రూములో ఓ కాపీ పెట్టేవారు. ఒకనాడు ఊరంతా తిరిగిన ఈ చందమామ తనకు తానుగా నా ముందు కొచ్చినందుకు నా అదృష్టానికి మురిసిపోయేవాడిని. ఇప్పటికీ ఆ మోజు అలాగే ఉంది. అరణాల పత్రిక 20 రూపాయలకు పెరిగినా, చందమామ నా చెంతే ఉంది.

## చందమామతో నా జ్ఞాపకాలు - ఒడియా

ఇది చందమామ, మనోజ్‌దాస్, నాకూ మధ్య 45 ఏళ్లక్రితం జరిగిన కథ. నేను ఉన్నత పాఠశాలలో చదువుతూ ఉండేవాడిని. ప్రముఖ ఒడియా దినపత్రిక 'సమాజ'లో సుప్రసిద్ధ రచయిత మనోజ్ దాస్ 'సాంబాడ్ సమీక్ష' అనే కాలమ్ నిర్వహిస్తూండేవారు. ఒక కథనంలో తను తమిళనాడులో విడుదలవుతున్న ఒక పుస్తకం ప్రాధాన్యత గురించి రాశారు. ఆ సందర్భంగా పది పుస్తకాల శీర్షికల జాబితాను ఇచ్చారు. వీటిని చదివిన వారు ప్రపంచ సాహిత్యాన్ని అర్థం చేసుకోగలరని భావించాను.



Name: B.K. Satapathy
Occ : Retd. Bank Officer,
Bhubaneswar, Odisha.

ఆ కథనం చదివాక, నేను ఒక పోస్ట్ కార్డును పాండిచ్చేరిలోని మనోజ్ దాస్ చిరునామాకు పంపాను. కొన్నాళ్ళకే నేను ఆయన ప్రస్తావించిన పుస్తకాల జాబితాను అందుకున్నాను. కాని అప్పట్లో ఆ పుస్తకాలు కొనలేకపోయాను. 20 సంవత్సరాలు గడిచిపోయాయి. నేను ఉద్యోగం చేస్తున్నప్పుడు నాకు పుస్తకాలు కొని చదవగలను అనిపించింది. కాని మనోజ్ దాస్ పంపిన ఆ పుస్తకాల జాబితా మాత్రం నావద్ద లేకుండా పోయింది.

మరోసారి మనోజ్‌దాస్‌ని నేను అభ్యర్థించాను కాని ఆయన సైతం ఆ జాబితా ఎక్కడుందో కనుగొనలేకపోయారు. నేను తిరిగి ఉత్తరం రాస్తే, ఆయన నాకు సమాధానం పంపారు. 'మీరు మంచి పత్రిక కొనాలనుకుంటున్నారా? మార్కెట్ ఇవాళ క్రీడలు, సినిమా, చౌకబారు పత్రికలతో నిండిపోయింది. మీరు ప్రతినెలా చందమామను చదవండి చాలు,' ఆనాటి నుంచి నేను చందమామను చదువుతూ వస్తున్నాను.

## బేతాళ కథలు

# ఇద్దరు కొడుకులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా స్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా, నువ్వు ఎవరి మేలు కోసం ఇంతటి కష్టసాధ్యమైన కార్యానికి పూనుకున్నావో నాకు బోధపడటం లేదు. కొందరు మహోన్నతమైన వ్యక్తులు కూడా తొలుత నిష్పక్షపాతంగా వ్యవహరించాలనుకుని తుదకు తెలిసో తెలియకో పక్షపాత ధోరణితో వ్యవహరిస్తారు.

నువ్వు అటువంటి వ్యక్తుల గురించి శ్రమిస్తూ ఉంటే తుదకు భంగపడగలవు. నీ మేలు కోరి స్వర్ణధార రాజ్యం రాజు విక్రమభూపతి కథ చెబుతాను. శ్రమతెలియకుండా విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

స్వర్ణధార రాజ్యం రాజు విక్రమ భూపతి మహావీరుడు, దయాళువు. అతని పాలనలో ఆ రాజ్యవాసులు సుఖసంతోషాలతో తేలియాడేవారు.



విక్రమ భూపతి సంతానం లేకపోవడంతో చాలా అసంతృప్తిగా ఉండేవాడు. సంతానం కోసం రాజదంపతులు ఎన్నో పూజలు, యాగాలు చేశారు. అయినా ఫలితం లేక పోయింది.

మహారాణి ముకుందమాల రాజును ద్వితీయ వివాహం చేసుకోమని వేడుకుంది. అందుకు విక్రమ భూపతి చాలా కాలం సుముఖత చూపలేదు. మహారాణి పదే పదే ప్రాధేయపడటంతో చివరికి వల్లికా దేవితో మహారాజు వివాహం జరిగింది. త్వరగానే వల్లికాదేవి కడుపు పండింది. అందుకు మహారాజుతో పాటు మహారాణి ముకుంద మాల కూడా ఎంతగానో సంతోషపడింది.

ఒక శుభ ముహూర్తాన వల్లికా దేవి పండంటి బిడ్డను ప్రసవించింది. విక్రమ భూపతి కుమారుడికి జయతేజుడు అని నామకరణం చేశాడు. ఏడాది తిరిగేసరికి దైవం కరుణించి మహారాణి ముకుంద మాల కూడా గర్భం దాల్చింది. అందుకు అందరూ ఎంతగానో సంతోషించారు.

మహారాణి కూడా ఒక శుభసమయాన కుమారుడిని ప్రసవించింది. రాజదంప తులా బిడ్డకు మయూర ధ్వజుడు అని పేరు పెట్టారు.

యువరాజులిరువురూ చిన్ననాటి నుంచి ఎంతో కలివిడిగా ఉండేవారు. ఏ సమయం లోనూ తగవు పడేవారు కాదు. వారి అన్యో న్యత చూసి అందరూ ముచ్చటపడేవారు.

విక్రమ భూపతి కుమారులిద్దరినీ గురు కులంలో చేర్చాడు. మయూర ధ్వజుడు, జయతేజుడు ఇరువురూ గురుకులంలో శ్రద్ధగా విద్య నేర్చారు. యుక్తవయసు వచ్చే సరికి యువరాజులిరువురూ సకల విద్యలు నేర్చారు.

విద్యాభ్యాసం ముగించుకు వచ్చిన కుమా రులను చూసి విక్రమ భూపతి ఎంతగానో సంతోషించాడు.

వృద్ధుడైన విక్రమభూపతి కుమారులకు సింహాసనం అప్పగించాలనుకున్నాడు. అక్కడే అతనికో సమస్య వచ్చి పడింది. సంప్రదాయాన్ని అనుసరించి పెద్ద భార్య కుమారుడికి పట్టం కట్టాలి కానీ అతని కంటే చిన్న భార్య కుమారుడు పెద్దవాడు. మరిప్పుడు పెద్దవాడైన చిన్న భార్య కుమా రుడికి పట్టం కట్టాలా? లేక చిన్నవాడైన పెద్ద భార్య కుమారుడికి పట్టం కట్టాలా? విక్రమ

భూపతి ఎటూ తేల్చుకోలేకపోయాడు. అతడా విషయంలో మంత్రుల సలహా కోరాడు. అయితే వారి సలహాలు మహా రాజుకు అంతగా నచ్చలేదు.

ఎటూ తేల్చుకోలేక, విక్రమ భూపతి కొడుకులిద్దరినీ చేర బిలిచి, 'నాయనలారా! మీరు ఆరునెలలపాటు దేశాటనం చేసి రండి. పనిలో పనిగా పొరుగు రాజ్యాలు కూడా తిరిగి రండి. నన్ను కలిసి మీ అను భవాలు తెలియబరచండి,' అని చెప్పాడు. యువరాజులిద్దరూ అందుకు సమ్మతించి దేశాటనకు బయలు దేరారు.

సరిగ్గా ఆరునెలల తర్వాత జయతేజుడు, మయూరధ్వజుడు దేశాటనం ముగించుకు వచ్చి తండ్రిని కలిశారు.

అప్పుడు విక్రమ భూపతి వారి అనుభ వాలను చెప్పమని కోరాడు.

జయతేజుడు, 'మీరు చెప్పినట్లు మన రాజ్యలోనూ, పొరుగు రాజ్యమైన వైకంఠిక లోనూ దేశాటనం చేశాను. మన రాజ్యం అన్ని రకాలుగానూ అభివృద్ధి చెందింది. ప్రజలు మీ పాలనలో సంతృప్తిగా ఉన్నారు. వైకంఠిక రాజ్యం మాత్రం మన ముందు తీసికట్టు. వారు మన పాలనను విమర్శి స్తూనే, మనలను అనుసరించడానికి ప్రయ త్నిస్తున్నారు. అదే మన గొప్పతనాన్ని చాటి చెబుతున్నది' అని చెప్పాడు.

విక్రమ భూపతి నువ్వేం చెబుతావు అన్నట్లు చిన్న కుమారుడైన మయూరధ్వ జుడి వైపు చూశాడు. అప్పుడు మయూర ధ్వజుడు, 'జయతేజుడు చెప్పినట్లు మన రాజ్యం అన్ని రంగాల్లోనూ వృద్ధి చెందింది. అయితే రాజైన వాడు సాధించిన దానితో సంతృప్తి చెందక, ఇంకా ముందుచూపుతో





ఆలోచించాలి. మన రాజ్యంలో ఇంకా పేద వారున్నారు. వారి జీవితాలను బాగు పరిచే ప్రయత్నం చేయాలి. అలాగే పొరుగు రాజ్యంలోని జీవనది గంగను చూసినప్పుడు నాకో ఆలోచన వచ్చింది. మన రాజ్యంలో నదులు లేక మనం వర్షంపైనే ఆధారపడవలసి వస్తున్నది. అదే గంగను వైకంఠిక రాజ్యం నుంచి మన రాజ్యానికి రప్పించగలిగితే మన రాజ్యంలో క్షామం అనేది ఎప్పటికీ రాదు. మనం సర్వతోముఖ అభివృద్ధిని సాధించవచ్చు,' అని చెప్పాడు.

'నీవు చెప్పింది బాగున్నది. కానీ వైకంఠిక రాజు రుద్రకేతు మనతో శతృత్వం వహిస్తున్నాడు. అతడి రాజ్యం నుంచి నదీ జలాలను ఎలా రప్పించగలం?' అని సందేహం వ్యక్తపరిచాడు.

అప్పుడు జయతేజుడు 'పొరుగు రాజ్యం నుంచి నదీజలాలు రప్పించడం అసాధ్యం,' అన్నాడు. అది విన్న మయూర ధ్వజుడు 'అసలు మనమేమీ ప్రయత్నించకుండానే అసాధ్యం అని ఎలా అనగలం? ప్రతీ సమస్యకూ ఒకపరిష్కారం ఉంటుంది. మనమా దిశగా అడుగులు వేయాలి. ఆశావహదృక్పథంతో ఉండాలి,' అన్నాడు.

'మయూరధ్వజుడు చెప్పినట్లు మన ప్రయత్నం మనం చేద్దాం,' అన్నాడు విక్రమ భూపతి.

కొద్దిమాసాలు గడిచాయి. వైకంఠిక రాజు, విక్రమభూపతి మీద యుద్ధం ప్రకటించాడు. విక్రమభూపతి మంత్రులను పిలిపించి, ఇద్దరు కొడుకులతో సమావేశమయ్యాడు. అందరి అభిప్రాయాలు కోరాడు. జయతేజుడు, తండ్రితో 'రుద్రకేతు సైన్యం మన కంటే రెట్టింపు. యుద్ధమే జరిగితే మనకు ఓటమి తప్పదు. అందుకని అతనితో సంధి చేసుకోవడం నయం,' అన్నాడు. విక్రమభూపతి చిన్నకొడుకైన మయూర ధ్వజుడి అభిప్రాయం కోరాడు. అప్పుడతడు 'ఇది మనకొచ్చిన అపూర్వ అవకాశంగా భావించవచ్చు. మన సైన్యాన్ని జాగ్రుతపరిచి ముందుకు నడిపించి విజయం సాధించ గలిగితే మనం ముందు అనుకున్నట్లు వైకంఠిక లోని గంగా నదిని మన రాజ్యానికి రప్పించవచ్చు. అకారణంగా వైకంఠిక రాజు మన మీద దాడి చేస్తున్నాడు కాబట్టి ఆ విషయాన్ని సాటి రాజుల ముందు ఉంచితే కొందరు మనకు సైనిక సహాయం చేయగ

లరు. మనం అధైర్య పడక ఆత్మ స్థైర్యంతో ముందుకు సాగాలి,' అని తన అభిప్రాయం చెప్పాడు. మయూరధ్వజుడు. అతడి అభిప్రాయాన్ని మంత్రులు సమర్థించారు.

మయూరధ్వజుడు చెప్పినట్లు సాటి రాజులు కొందరు విక్రమ భూపతికి అండగా నిలిచారు. సైన్యాన్ని ముందుకు నడిపించాడు మయూరధ్వజుడు. అతని ధైర్యవచనాలతో స్వర్ణధార సైనికులు అమితోత్సాహంతో యుద్ధం చేశారు. మయూర ధ్వజుడి చేతిలో రుద్రకేతు మరణించాడు.

స్వర్ణధార రాజ్యాన్ని విజయలక్ష్మి వరించింది. అనంతరం రాజ్యం చేరిన మయూర ధ్వజుడు, తండ్రికి విజయవార్త చెప్పి 'యుద్ధానికి ముందు మీరు మన రాజ్యాన్ని జయతేజుడికి అప్పగించాలా? లేక నాకు అప్పగించాలా? అని మధనపడ్డారు. ఇప్పుడా సమస్య తొలగిపోయింది. మన రాజ్యానికి జయతేజుడిని రాజును చేయండి. తర్వాత మనం గెలిచిన వైకంఠికకు నన్ను రాజును చేయండి,' అని కోరాడు.

విక్రమ భూపతి సంతోషంతో, మయూరధ్వజుడ్ని కౌగలించుకుని ఒక శుభముహూర్తాన స్వర్ణధార రాజ్యానికి మయూరధ్వజుడిని రాజును చేసి, వైకంఠిక రాజ్యానికి జయతేజుడిని సామంతరాజుగా ప్రకటించాడు.

అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు, 'విక్రమార్క మహారాజా! జయతేజుడు వాస్తవానికి దగ్గరిగా ఆలోచించే వ్యక్తిలా గోచరిస్తున్నాడు. అందుకే తన రాజ్యపరిస్థితులు, పొరుగు రాజ్య పరిస్థితుల కంటే బాగున్నట్లు



తండ్రికి వివరించాడు. అలాగే పొరుగు రాజు రుద్రకేతు స్వర్ణధార మీద యుద్ధం ప్రకటించినప్పుడు రెట్టింపు సైనిక బలం ఉన్న వారితో సంధి నయమని సూచించాడు. కానీ మయూరధ్వజుడు తండ్రి మనసు చూరగొనడానికి పొరుగు రాజ్యంలోని గంగానదిని తమ రాజ్యంలోనికి రప్పించగలిగితే మరింత ప్రగతి సాధించవచ్చని, అలాగే యుద్ధం చేస్తే విజయం సాధించవచ్చునని, గంగా నదీ జలాలు తమ రాజ్యానికి రప్పించవచ్చునని, కల్లిబొల్లి కబుర్లతో తండ్రిని నమ్మించాడు. అదృష్ట వశాన విజయం వరించబట్టి సరిపోయింది కానీ, లేకుంటే అసలుకే ఎసరు వచ్చేది. ఇకపోతే మయూరధ్వజుడు తమ రాజ్యానికి జయతేజుడిని రాజును చేసి, తాము గెలిచిన వైకంఠిక రాజ్యానికి తనను

రాజును చేయమంటే విక్రమ భూపతి అందుకు విరుద్ధంగా స్వర్ణధార రాజ్యాన్ని మయూర ధ్వజుడికి ఇచ్చి వైకంఠిక రాజ్యానికి జయతేజుడిని సామంత రాజును చేయడం కేవలం చిన్న కొడుకు మీద అభిమానమే! విక్రమ భూపతి వంటి ధార్మికుడు చిన్న కొడుకుపై పక్షపాతం చూపడం కాదా! ఈ ప్రశ్నకు తెలిసీ సమాధానం చెప్పకపోయావో నీ తల నూరు వక్కలై పగిలిపోతుంది,' అన్నాడు.

అప్పుడు విక్రమార్కుడు 'రాజైనవాడు సాధించినదానితో సంతృప్తి చెందక ఎక్కువగా ఆలోచించగలిగినప్పుడే రాజ్యం మరింతగా ప్రగతి సాధిస్తుంది. అలాకాక సాధించిన దానితో తృప్తి చెందితే రాజ్యాభివృద్ధి తిరోగమిస్తుంది. అలాగే రాజయిన వాడు నిరంతరం ఆశావహదృక్పధంతో ఉండాలి. అలా కాక నిరాశావాదాన్ని అలవర్చుకుంటే ఆ ఛాయలు పరిపాలన మీద పడతాయి. రాజ్యాభివృద్ధి కుంటుపడుతుంది. అందుకే జయతేజుడు సంతృప్తిపరంగా, నిరాశాజనకంగా మాట్లాడినప్పుడు మయూరధ్వజుడు రాజ్యప్రగతి పట్ల మరింత ఆకాంక్షను వెలిబుచ్చాడు. యుద్ధభేరీ మోగించినప్పుడు ధైర్యంగా ఆశాజనకంగా మాట్లాడాడు. సాటి రాజుల సహాయం పొంది సైనికులను ఉత్సాహపరిచి యుద్ధంలో విజయం సాధించగలిగాడు. రాజు కాబోయేవాడికి అవసరమైన ముందు చూపు, ధైర్యం, కార్య దక్షత మయూరధ్వజుడిలో పుష్కలంగా ఉండబట్టే మహారాజు చిన్నవాడైనా మయూర ధ్వజుడికి స్వర్ణధార రాజ్యం కట్టబెట్టాడు. జయతేజుడు ఆయా విషయాల్లో అనుభవం గడించేవరకూ సామంత రాజుగా ఉండటమే నయమని విక్రమ భూపతి భావించాడు. అంతే గాని చిన్నవాడైన మయూర ధ్వజుడి పట్ల పక్షపాతం ఎంతమాత్రం కాదు,' అని సమాధానం చెప్పాడు.

విక్రమార్కుడికి ఈ విధంగా మౌన భంగం కాగానే బేతాళుడు తిరిగి శవంతో సహా చెట్టెక్కాడు. - కల్పితం

(ఆధారం: ఎన్. శివనాగేశ్వరరావు)





# ఎవరు పాపి?

ఒక ఊళ్లో ధనగుప్తుడనేవాడు అనేక పాపాలకు ఒడిగట్టి, ధనం సపాదించి, కోటీశ్వరుడైనాడు. ఆయనను గురిగా పెట్టుకుని, ఆయన సహాయంతో అనేకమంది ఇతర వర్తకులు లక్షాధిపతులయారు.

ధనగుప్తుడికి ముసలితనం పైనపడింది.

చావు దగ్గిరికి వస్తున్నకొద్దీ ఆయనకు పాపభీతి పట్టుకున్నది. బతికినన్నాళ్లూ పాపాలే చేశాడు. ఇకనైనా కొంత పుణ్యం మూట కట్టుకోకపోతే, చచ్చినాక ఏ నరక కూపాలలో యాతన పడవలసివస్తుందోనని ఆయన భయపడసాగాడు. పుణ్యం సంపాదించటానికి గాను తీర్థయాత్రలు చేసి వద్దామనుకున్నాడు.

ధనగుప్తుడు తీర్థయాత్రలకు బయలుదేరుతున్నాడనేసరికి మరి ముగ్గురు వర్తక శ్రేష్టులు కూడా ప్రయాణమయారు. వారు కూడా పుణ్యం చేసుకుని ఎరగరు.

ధనగుప్తుడు ఏదో పరమార్థం లేనిదే ఏ పనీ చెయ్యడని వారికి తెలుసు. పుణ్యం మాట అటుంచి, ఈ తీర్థయాత్ర వల్ల ఇంకేవైనా లాభాలుండవచ్చు. ఆ లాభాలు తాము మాత్రం ఎందుకు పొందగూడదూ? అదీగాక, ఒకరికి నలుగురైతే ఖర్చు కలిసి వస్తుంది. దారిలో ఎవరికి కాస్త జబ్బు చేసినా మిగిలినవాళ్లు ఆదుకుంటారు. ఇవన్నీ ఆలోచించి ధనగుప్తుడు వారిని వెంటపెట్టుకు పోవడానికి ఒప్పుకున్నాడు.

కాశీ వెళ్లటమా, రామేశ్వరం వెళ్లటమా అని వారిలో వారికి చర్చ జరిగింది. కాశీకి పోవటమూ, కాటికి పోవటమూ ఒకటేనని సామెత. రామేశ్వరమైతే దగ్గిర, దారి

శింగంపల్లి అప్పారావు

సులువు. అదీగాక ఆ గ్రామంలోనే రాముడని ఒక పంచముడున్నాడు. తాను ఇంట్లో అలిగి మూడుసార్లు రామేశ్వరం పారిపోయి తిరిగి వచ్చాడు. వాడికి రామేశ్వర ప్రయాణం కొట్టినపిండి. వాణ్ణి వెంటబెట్టుకుని నలుగురు వర్తకులూ రామేశ్వరం పోవటానికి నిశ్చయించారు.

మంచిరోజు చూసుకుని, రాముడు ముందుదారి తీయగా, రామనామ స్మరణ చేస్తూ నలుగురు వర్తకులూ రామేశ్వరం బయలు దేరారు.

ప్రయాణం అన్నివిధాలా అనుకూలంగానే సాగింది. ఇంకా ఒకటి రెండు రోజుల ప్రయాణం మిగిలి ఉందనగా కారుమేఘాలు ముంచుకువచ్చాయి. ప్రళయమైన గాలి వీచసాగింది.

ఆ సమయాన యాత్రికులు ఒక అడవి గుండా నడుస్తున్నారు. గాలికి ఎంతెంత మానులూ-భయంకరంగా ఊగుతూ, విరిగి మీద పడేటట్టు కనబడ్డాయి. పైన మేఘాలు ఏనుగుల మందలాగా తిరుగుతూ భీకరంగా గర్జిస్తున్నాయి. కళ్లు చెదిరే మెరుపులకు యాత్రీకుల కళ్లు గుడ్డి అయిపోతున్నాయి.

వాళ్లు పిక్కబలం కొద్దీ పరిగెత్తి, ఎట్లాగయితేనేం, ఒక పాడుపడిన చిన్న దేవళంలో తలదాచుకున్నారు. వెంటనే పిడుగుల వర్షం ప్రారంభమయింది. వారున్న చోటికి అతి సమీపంలోనే ఒకటి తర్వాత ఒకటిగా పిడుగులు, భయంకరమైన శబ్దంతో పడసాగాయి. ఒక పిడుగు అంతదూరాన ఉన్న పెద్ద చెట్టుమీద పడింది. చెట్టు సగం



సురసురా కాలి పోయింది. మిగిలినది విరిగి పడిపోయింది. మరికొద్ది క్షణాలకు ఇంకొక పిడుగు దేవళానికి యాభై అంగల దూరాన పడింది. యాత్రికులకు ప్రాణా లలో ప్రాణాలు లేవు.

'ఇదేం పిడుగుల వర్షం! నా జన్మలో ఎన్నడూ ఇలాటిది ఎరగను! మనలో ఎవడో పాపాత్ముడున్నాడు. ఆ పాపాత్ముడి కార ణంగా మనమందరమూ నాశనం అవుతాం. తప్పదు!' అన్నాడు ధనగుప్తుడు.

'ఈ రాముడే పాపాత్ముడు. ఈ పంచ ముడిని మనం తీసుకురావడమే తప్పు. తెచ్చామే అనుకో. వీడు కూడా మనతో సమంగా ఈ పవిత్రమైన దేవళంలో తగు దునమ్మా అని వచ్చి కూచున్నాడు. దేవుడు చూడడూ? ఆగ్రహించడూ?' అన్నాడు మరొక యాత్రికుడు.

నలుగురూ కలిసి రాముణ్ణి దేవళం వీడి అవతలికి వెళ్ళమన్నారు.

'బాబూ, పెద్దవాన అయింది. తడిసిపో తాను. కరుణించండి. పుణ్యం కట్టుకోండి. నేను పాపినే: కాని మీ వంటి పుణ్యాత్ముల పక్కనుంటే నన్ను దేవుడేమీ చెయ్యడు. నా ఒక్కడి మూలంగా మీరు నలుగురు నష్ట పడతారా? దేవుడు అంత అన్యాయం చెయ్యడు!' అని రాముడు బతిమాలాడు.

వాడు చలికి వణుకుతూ, దణ్ణాలు పెట్టి బతిమాలుతున్న కొద్దీ యాత్రికుల గీర్వాణం మరింత ఎక్కువయింది. ఆఖ రుకు వాళ్ళు నలుగురూ చేరి రాముణ్ణి వాన లోకినెట్టేశారు. వాడు పరిగెత్తిపోయి దూరాన ఉన్న ఒక చెట్టు కిందికి వెళ్ళి నిలబడ్డాడు. మరుక్షణమే ఆకాశం పగిలినట్లు చప్పుడై పెద్ద వెలుతురయింది. రాముడు కళ్ళు గట్టిగా మూసి తెరిచేసరికి ఎదురుగా దేవళం లేదు: రాళ్లగుట్ట మాత్రమే ఉంది. ధనగు ప్తుడితో పాటు ముగ్గురు యాత్రికులూ పిడుగువాత పడి చనిపోయారు.





# దొంగను మార్చిన కుక్క

గంగన్న అనే దొంగ అడివిలో చిన్న ఇల్లు కట్టుకుని ఉండేవాడు. చీకటిరాత్రులలో శింగవరం వచ్చి అనువైన ఇంటిని కొల్లగొట్టి తెల్లవారకుండా అడివిలోకి వెళ్ళిపోయేవాడు. ఒకరోజు గంగన్న ఇంటికి వెళుతున్నప్పుడు ఒక చిన్న కుక్క పిల్ల వెంటపడి అతని ఇంటికి వెళ్ళిపోయింది. గంగన్న దానికి ఇంత ముద్ద పెట్టాడు. ఆ కుక్క అతనితోనే ఉండసాగింది. ఒంటరి గంగన్నకు ఆ కుక్క దేవుడిచ్చిన తోడనిపించింది. కొన్నాళ్లకు ఆ కుక్క పెరిగి ఒక చిన్న సింహంలా తయారైంది.

ఒక రోజు గంగన్న దొంగతనం చేస్తూ భటులకు దొరికిపోయాడు. రాజు అతనికి ఐదు ఏళ్లు కారాగారశిక్ష విధించాడు. గంగన్న రాకపోయేసరికి, కుక్క అతడిని వెదుకుతూ శింగవరం చేరింది. ఎంత వెదికినా గంగన్న జాడ తెలియలేదు. ఆ కుక్క అలసిపోయి, ఒక ఇంటి పంచన నీడలో పడుకుంది. ఆ ఇంటి యజమాని రామయ్య అనే రైతు. కుక్కను చూసి జాలిపడి దానికి ఇంత అన్నం పెట్టాడు. ఆ కుక్క రామయ్య పెట్టింది తిని ఆ ఇంటి ముందే ఉండిపోయింది.కొద్ది రోజుల్లో రామయ్యకు కుక్కకు మంచి మైత్రి ఏర్పడింది.

ఐదేళ్లు గడిచిపోయాయి. గంగన్న కారాగారం నుంచి విడుదలై ఇంటికి వెళ్లిపోయాడు. అడివంతా గాలించినా కుక్క కనిపించక పోయేసరికి గంగన్న బాధ పడ్డాడు.

ఒకరోజు గంగన్న శింగవరంలో ఒక ఇంటికి దొంగతనానికి వెళ్లాడు. అది రామయ్య ఇల్లు. గంగన్న ఆ ఇంటిగోడకు కన్నం తవ్వసాగాడు. ఆ శబ్దానికి కుక్క మొరగబోయి గంగన్నను గుర్తుపట్టి ఆగిపోయింది. గంగన్న మాత్రం కుక్కను చూడలేదు.

డి. పూర్ణిమ

ఒకప్పుడు తనను పోషించిన గంగన్న పట్ల విశ్వాసం చూపించాలా? లేక ప్రస్తుతం తనకు ఆశ్రయం కల్పించిన రామయ్యపై విశ్వాసం చూపించాలా! అని కుక్క సందిగ్ధంలో పడింది. ఇంతలో రామయ్యకు మెలకువ వచ్చింది. దొంగ ఎవరో తన ఇంటికి కన్నం తవ్వుతున్నాడని గ్రహించాడు. గునపాన్ని తీసుకుని ఇంట్లోనుంచి కన్నానికి అటోకాలు, ఇటోకాలు వేసి గునపాన్ని రెండు చేతులతో పట్టుకుని నిలుచున్నాడు. దొంగ కన్నంలోకి దూరగానే, గునపంతో పొడిచి చంపడానికి సిద్ధంగా ఉన్నాడు.

కుక్క తలుపు సందులోంచి రామయ్య చేతిలోని గునపాన్ని చూసింది. గంగన్నను చంపడానికి రామయ్య సిద్ధంగా ఉన్నాడని గ్రహించింది. అది మొరిగి గంగన్న పారిపోతే రామయ్యకు ద్రోహం చేసినట్లు లెక్క. మొరగకుండా ఉంటే రామయ్య చేతిలో గంగన్న చచ్చిపోతాడు. కాబట్టి గంగన్నకు ద్రోహం చేసినట్లు అవుతుంది. ఏమి చేయాలా అని కుక్క సందిగ్ధంలో పడిపోయింది.

గంగన్న ఈలోగా కన్నంలో దూరటానికి ప్రయత్నించాడు. కుక్క ఒక్కసారిగా, ఆ కన్నంలో ఒక్క దుముకున దూరిపోయింది. రామయ్య దొంగ దూరాడు అని భావించి, చేతిలోని గునపాన్ని కుక్క నడుం మీద దింపేశాడు. 'కుయ్యో' అని కుక్క చనిపోయింది. ఈ అలజడికి గంగన్న పారిపోయాడు. కుక్క చేసిన ప్రాణత్యాగం అర్థం కాని రామయ్య, కుక్కను తనే స్వయంగా చంపినందుకు ఎంతో బాధపడ్డాడు.

తెల్లవారాక గంగన్న శింగవరం వచ్చి విషయం తెలుసుకుని, చనిపోయిన తన కుక్కను చూసి ఏడ్చాడు. రామయ్య పాదాల మీద పడి 'రాత్రి మీ ఇంటికి దొంగతనానికి వచ్చిన దొంగను నేనే. ఈ కుక్క ఒకప్పుడు నా దగ్గర ఉండేది. దానికున్న జ్ఞానం కూడ నాకు లేదు. నాకు ఏదైనా పని ఇప్పించండి. నేను కష్టపడి బతుకుతాను,' అని రామయ్యను ప్రాధేయపడ్డాడు. ఆ రోజు నుండి దొంగగా బతికే గంగన్న కష్టజీవిగా మారిపోయాడు.



# ఎవరు మంత్రి?

ఒక రాజుగారి ప్రధానమంత్రి ఆకస్మికంగా చనిపోయాడు. ఆయన కింద ఉపమంత్రులు ముగ్గురుండేవారు. వారిలో ఎవరిని ప్రధానమంత్రిని చెయ్యటమా అన్నది రాజుకు సమస్య అయిపోయింది. ఏ ఒకరికి ఆ పదవి ఇచ్చినా మిగతా ఇద్దరికీ అన్యాయం జరగవచ్చు. ముగ్గురిలోనూ ప్రధాని పదవికి అర్హుడెవరో రాజు తేల్చలేకపోయాడు.

కొద్ది రోజులు గడిచాక రాజు సపరివారంగా నదీతీరానికి వెళ్లాడు. ఆయన వెంట ఉప ప్రధానులు ముగ్గురూ ఉన్నారు. అందరూ నది ఒడ్డున కూర్చుని సరదాగా కాలక్షేపం చేస్తూండగా రాజు నది ఎగువకు చూసి నీటిలో ఏదో కొట్టుకు వస్తున్నది. 'అదేమిటై ఉంటుంది?' అన్నాడు ఉపమంత్రులతో.

ముగ్గురిలో ఒకడు కళ్లమీద చేయి పెట్టి పరకాయించి చూసి, 'ఏదో పండులాగుంది,' అన్నాడు.

మరొకడు లేచి నిలబడి చూసి, 'అవును మహారాజా! మామిడిపండు,' అన్నాడు.

ఈ లోపల మూడోవాడు లేచి, తన కోటూ, తలపాగా తీసి ఒడ్డున పారేసి, నదిలోకి దూకి, ఈదుకుంటూ వెళ్లి, ఈ లోపల సమీపానికి వచ్చిన మామిడిపండును తీసుకుని మళ్లీ ఈదుకుంటూ వచ్చి, పండును తెచ్చి రాజుగారికిచ్చాడు.

కార్యశూరుడైన ఆ ఉపమంత్రిని రాజు ప్రధానిగా నియమించాడు.



# ఆస్తిపంపకాలు

ఒంటిమిట్ట గ్రామంలో రామయ్య అనే మోతుబరికి నలుగురు కొడుకులు. వ్యవసాయంతో పాటు పలు వ్యాపారాలు కూడా చేసే రామయ్యకి ఆస్తులన్నీ తన నలుగురు కొడుకులకు పంచడం పెద్ద సమస్యగా మారింది.

హఠాత్తుగా ఆరోగ్యం క్షీణించి మంచాన పడ్డ రామయ్య వెంటనే కొడుకులను పిలిపించి 'నాయనలారా! ఎన్నాళ్లు బ్రతుకుతానో నాకే తెలియదు. నేనుండగానే ఆస్థిపాస్తులను ఎవరికేం ఇవ్వాలో ఇచ్చేద్దామని నిర్ణయించుకున్నాను. మీ ఆలోచనలు కూడా చెప్పండి. నా తర్వాత మీరు ఆస్తుల కోసం కుమ్ములాడు కోవడం నాకిష్టం లేదు,' అన్నాడు.

'నేను వ్యవసాయం చూసుకుంటాను నాన్నా!' టక్కున అన్నాడు పెద్దవాడు. 'నేను ఊళ్లో వ్యాపారాలు చూసుకుంట్టాను నాన్నా..!' అన్నాడు రెండోవాడు. 'మిగతా ఊళ్ళలో ఉన్న వ్యాపారాలు నేను చూసుకుంటాను,' అంది అన్నాడు మూడోవాడు.

ఇక మిగిలింది నీటి మీది వ్యాపారాలు. ఆఖరివాడివైపు తలతిప్పాడు రామయ్య.

వాడు కాసేపు మౌనంగా ఉండి, 'నేను నిన్ను చూసుకుంటాను నాన్నా' అన్నాడు.

రామయ్యకు ఏడుపొచ్చింది. ఆఖరువాడు కూడా ఏడుస్తూ.. 'నిన్ను కంటికి రెప్పలా కడదాకా చూసుకుంటాను నాన్నా. నువ్వు నాకేం ఇవ్వనక్కరలేదు. జన్మనిచ్చావు చాలదూ. ఇంతటి వాణ్ణి చేశావు చాలదూ..!' అన్నాడు. చిన్నవాడి మాటలకి మిగతావాళ్లు సిగ్గుపడ్డారు.

'నన్ను క్షమించు నాన్నా. ఆస్తి పంపకాల గొడవ లేమీ వద్దు. ఉన్నదేదో అందరం కలిసే చేసుకుంటాం. కలిసే ఉంటాం.అంతా కలిసే నిన్ను చూసుకుంటాం, అన్నారు ముగ్గురూ ఒకేసారి. రామయ్య సంతోషంతో నలుగురినీ దగ్గిరికి తీసుకున్నాడు. – పి. వెంకటేష్





# పంచతంత్ర కథలు

రాజభవనంలో ఒక పెంపుడు కోతి ఉండేది. రాజు దానిని చూసి ముచ్చట పడి తన అంగరక్షకుడుగా నియమించాడు. ఆ కోతి దర్పంగా అతని కత్తి పట్టుకుని నడుస్తుంటే అందరూ విరగబడి నవ్వేవారు. రాజోచిత మైన భోజనాలతో ఆ కోతి చక్కగా తయారయింది. రాజోద్యోగులందరికీ అది అంటే చాలా ఇష్టం. రాజుకు ఆ కోతి మీద అమితమైన ఆప్యాయతా, విశ్వాసమూ ఏర్పడి, దానికి ఒక సొంత ఖడ్గం ఏర్పాటు చేశాడు. అది అస్తమానమూ దాన్ని పట్టుకుని తిరుగుతుండేది.

రాజభవనం సరసన ఒక అందమైన తోట ఉండేది. అందులో రకరకాల పూలూ, పళ్లూ ఉండేవి. ఒక శీతాకాలపు వెన్నెల రాత్రి పూలమొక్కల మధ్య వాహ్యాళి చేద్దామని, రాజూ, రాణీ ఆ తోటలో ప్రవేశించారు. పరివారమంతా తోట ద్వారం వద్ద ఆగిపోయింది. కాని కోతి మాత్రం వారి వెంట ఉన్నది. చాలాసేపు వెన్నెలలో పూల సౌందర్యం చూసి ఆనందించి, రాజదంపతులు ఒక పొదరింట ప్రవేశించారు.

రాజు కోతితో, 'నేను నిద్రపోతాను. నిద్రపోయేటప్పుడు నాకు ఏమీ హాని రాకుండా చూస్తూ ఉండు,' అని నిద్రపోయాడు. తరవాత కొంతసేపటికి రాణి కూడా నిద్రపోయింది. కోతి మాత్రం కత్తి భుజాన పెట్టుకుని నిలబడింది.

కొంతసేపటికి, పువ్వుల మధ్య తిరుగుతున్న తుమ్మెద ఒకటి, రాజు శరీరం నుంచి వస్తున్న సువాసనల చేత ఆకర్షించబడివచ్చి రాజు తలమీద వాలింది.

మిత్రభేదం - 32



ఇది చూసి కోతి మండిపడి, 'ఏమిటీ? నేనిక్కడ ఉండగానే ఈ క్షుద్ర కీటకం రాజు తలమీద వాలటానికి సాహసిస్తుందా?' అనుకుని, ఎడమచేత్తో దాన్ని తోలేసింది. కాని అది మళ్లీ ఎగిరివచ్చి రాజు తలమీద వాలింది. కోతి దాన్ని ఎన్నిసార్లు తోలినా అది మళ్లీ వచ్చి రాజు తలమీదనే వాలుతున్నది.

కోతి కోపం పట్టలేక, 'ఉండు నీ పని చెబుతా,' అంటూ తన చేతిన ఉన్న బరువైన ఖడ్గం ఎత్తి బలంగా తుమ్మెదను కొట్టింది. ఆ దెబ్బకు రాజు తల రెండుగా చీలింది. రాజు పెద్ద చావుకేక పెట్టి, ఆ క్షణంలోనే మరణించాడు.

ఆ కేకకు రాణి లేచి, కోతితో పాపీ, 'నీమీద ఎంతో విశ్వాసం ఉంచిన రాజును ఇలా చేశావేం?' అని అడిగితే, కోతి జరిగినదంతా చెప్పింది.

మంత్రి కొడుకు అక్కడికి వచ్చి, జరిగినది తెలుసుకుని, 'మూఢుడైన మిత్రుడి కన్న వివేకి అయిన శత్రువు మేలు. రాజును చంపుదామనుకున్న శత్రువు వివేకి కావటం చేత రాజు ప్రాణాలు కాపాడాడు. ఈ రాజే బుద్ధిలేని మిత్రుడైన కోతి చేత చచ్చిపోయాడు,' అన్నాడు.

కరటకం దమనకానికి ఈ కథ చెప్పి, 'మన సింహానికి నీ వంటి మూఢుడైన ఆప్తుడి కన్న వివేకం గల శత్రువు ఉంటే బాగుండేది. గుర్తుంచుకో, ఎప్పటికైనా తప్పు తప్పే, ఒప్పు ఒప్పే. ఎంత దాహం వేసినప్పటికీ మనుషులు మురికి గుంట నీరు తాగరు. కాని నీలాటి రాజకీయవేత్తల అభిప్రాయాలు అస్తవ్యస్తంగా ఉంటాయి. మిణుగురు పురుగును చూస్తే అగ్ని అనిపిస్తుంది. ఆకాశం చదునుగా తోస్తుంది. అబద్ధం నిజంగానూ, నిజం అబద్ధంగానూ కనిపిస్తుంది. ఎందుకూ? స్వార్థ దృష్టి తప్ప మరేదీ లేకపోవడం చేత. నీ వంటి స్వార్థ బుద్ధి ఒక్క దాని మాటలు వినేకన్న అనుభవం కల హితైషులను పదిమందిని సంప్రదించడం మన పాలకులు నేర్చుకోవడం మంచిదని నిన్ను చూసి గ్రహించాలి,' అన్నది.

దమనకానికి ఈ మాటలు ఏ మాత్రమూ

తలకెక్కలేదు. అది కపటంగా నవ్వి, తన అన్నను విడిచి వెళ్లిపోయింది.

ఈలోపల పింగళకమూ, సంజీవకమూ తిరిగి పోరాటం మొదలుపెట్టాయి. పింగళకం తీవ్రంగా గాయపడినప్పటికీ చిట్టచివరకు సంజీవకాన్ని చంపేసింది.

రక్తం ఓడుతూ పడి ఉన్న తన పాత మిత్రుడి శవాన్ని చూస్తూ ఉంటే పింగళకానికి జాలి పుట్టుకొచ్చింది.

'ఆహా ఎంత పని చేశాను. ఆతనే నేనూ, నేనే అతనూగా ఉంటిమే. అతన్ని చంపి, నేను కూడా సగం చచ్చాను,' అనుకున్నది పింగళకం.

దమనకం పింగళకం వద్దకు వచ్చి, 'మహారాజా, మీరు ఎందుకు విచారంగా ఉన్నారు? తండ్రి అయేది, తమ్ముడయేది, కొడుకయేది, మిత్రుడయేది, రాజు శత్రువును విధిగా చంపాలి. దుర్బలుడైన రాజునూ, నిగ్రహం చాలని న్యాయాధిపతినీ, కపట మిత్రుణ్ణీ, నీతిలేని భార్యనూ, పొగరుబోతు సేవకుణ్ణీ శీఘ్రంగా తొలగించాలి. సాధారణ వ్యక్తులు పాటించే నీతిసూత్రాలు రాజులకు వర్తించవు. ఇతరులలో దోషమనిపించుకునేది రాజులో సాధారణంగా గుణం అనిపించుకుంటుంది. రాజు సమయోచితంగా, విశ్వాసంగానూ, విశ్వాసరహితంగానూ ఉండాలి. క్రూరుడుగాను, దయామయుడుగానూ ఉండాలి. ధనాన్ని మంచినీరులాగానూ, మందులాగానూ వాడాలి. దాతగానూ, లోభిగానూ ఉండాలి. మీ సింహాసనానికి గాలం వేసిన ఈ సంజీవకాన్ని చంపటం చాలా మంచిపని,' అన్నది.

ఈ మాటలతో పింగళకానికి మనోవేదన కాస్త తగ్గింది. తరువాత అది దమనకాన్ని తన మంత్రిగా పెట్టుకుని, అరణ్యారాజ్యాన్ని పాలించసాగింది.

(మిత్రభేదం సమాప్తం)





# అర్హత

మహతీ రాజ్యంలో ఉన్న శరతుడి గురుకులంలో, నందుడు విద్యనభ్యసించేవాడు. నందుడు ఆ గురుకులంలో పనిచేసే తోటమాలి కొడుకు. నందుడికి విద్యపట్ల గల ఆసక్తిని గమనించిన శరతుడు, తన శిష్యుడిగా స్వీకరించాడు. నందుడు పట్టుదల, చురుకుదనం, విద్యపట్ల ఆసక్తి, అంకిత భావం కలవాడు.

ఒకసారి పొరుగుదేశపు రాకుమారుడైన వితలుడు, విద్యనభ్యసించడం కోసం శరతుని గురుకులానికి వచ్చాడు. శరతుడు అతడిని దీవించి 'నాయనా! ఆ రావిచెట్టు ప్రక్కన మొక్కలకు పాదులు కడుతున్నాడే, అతడే నా ప్రియ శిష్యుడు నందుడు. అతడిని కలువు. అతను నీకన్నీ వివరంగా చెబుతాడు' అన్నాడు.

వితలుడు రావిచెట్టు దగ్గరికెళ్ళి అక్కడ మొక్కలకు పాదులు కడుతూ తన ఈడు కుర్రాడిని చూశాడు. 'చూడండి, ఇక్కడ నందుడనే అతడు ఉంటాడని గురువుగారు చెప్పారు. అతనెక్కడ ఉంటాడో కాస్త చూపిస్తారా?' అని అడిగాడు. 'నేనే ఆనందుణ్ణి. మీకేంకావాలో చెప్పండి' అడిగాడు నందుడు.

నందుడిని చూసిన రాకుమారుడు ఆశ్చర్యపోయాడు.

'చిక్కటి నలుపురంగులో, అనాకారిలా ఉన్న ఈ నందుడితోనా నేను కలిసి చదువుకునేది?' అనుకున్నాడతడు. 'నీవు ఏ దేశపు రాకుమారుడివి?' అని అడిగాడు వితలుడు.

'నేను రాకుమారుడిని కాదు. మా తండ్రిగారు ఈ ఆశ్రమంలో తోటమాలి,' నిజాయితీగా చెప్పాడు నందుడు. రాకుమారుడు, 'అయితే గురువుగారి దయాదాక్షిణ్యాలతో

డాక్టర్ సిరి



మంలో ఉండలేనని, తన తండ్రితో పాటు తోటపని చూసుకుంటానని చెప్పాడు. అమాయకత్వంలో ఒక పసివాడు పలికిన మాటలు, మరో పసిహృదయాన్ని గాయప రిచాయి. ఈ గాయానికి తగిన మందు వేయాలి. అనుకున్నాడు గురువు.

'నాయనా నందా, నీ రంగూ, రూపూ, స్థాయీ నీ విద్యకు అడ్డంకులని భావిస్తు న్నావు. సరే నీ ఇష్టం. ఈ రోజు నేను ఒక కార్యం నిమిత్తం ప్రక్క గ్రామానికి పయన మవుతున్నాను. నాకు తోడుగా నిన్ను తీసు కెళ్లాలనుకుంటున్నాను. వస్తావు కదూ,' ప్రేమగా అడిగారు గురువుగారు. నందుడు తల ఊపి, గురువుగారితో ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

ఇక్కడ విద్యను అభ్యసిస్తున్నావన్నమాట. ఇది నీలాంటి వాళ్లుండాల్సిన చోటు కాదని నీకు తెలియదా? నీలాంటివారున్న చోట, నాలాంటి రాకుమారులు క్షణమైనా నిలువ లేరు,' అంటూ కోపంగా వెళ్లిపోయాడు.

విఠలుడి మాటలకి నందుడి మనసు బాగా గాయపడింది. ఎప్పుడూ హుషారుగా చురుకుగా ఉండే నందుడు, ఆ రోజు నుండి మౌనంగా, ఏదో పోగొట్టుకున్నవాడిలా ఉండ సాగాడు. ఎప్పుడూ ఒంటరిగా, తోటలోనే ఉండిపోయేవాడు.

నందుడి ప్రవర్తనలో మార్పును గమ నిస్తున్న శరతుడు, తను దేనిగురించో బాధ పడుతున్నాడని గ్రహించాడు. ఏం జరిగిం దని అడిగాడు శరతుడు ప్రేమగా. నందుడు, జరిగిందంతా వివరించి, ఇక తాను ఆశ్ర

ఇద్దరూ ప్రయాణం మొదలెట్టారు. వారు గ్రామానికి వెళ్లేదారిలో ఉన్న అడవిని దాటుతుండగా, అడవి మధ్యలోకి రాగానే గురువుగారు, 'నాయనా నందా నీకిష్టమైన వృక్షమేది?' అనడిగారు. 'బిల్వ వృక్షం', సమాధానం చెప్పాడు నందుడు.

'ఇదుగో ఈ కనిపించేదే బిల్వ వృక్షం,' అన్నాడు శరతుడు బిల్వవృక్షాన్ని చూపె డుతూ. నందుడు సంతోషంగా ఆ వృక్షాన్ని తన చేతితో తాకి, దండం పెట్టాడు.

కొంత దూరమెళ్లాక, వారు అడవిలో ఉన్న ఏరుని దాటవలసి వచ్చింది. ఆ ఏటి లోని నీటి సవ్వడి, నందుడి చెవులకు శ్రావ్య మైన సంగీతంలా వినిపించింది. ఉత్సా హంగా, ఆ ఏటిలో చేతులు పెట్టి ఆడాడు. అలా అడవిలోని ప్రతిదీ చూస్తూ, దాని

గురించి గురువుగారి నుండి తెలుసు కుంటూ ప్రయాణం చేయసాగాడు.

సాయంకాలానికి వారు గ్రామానికి చేరు కున్నారు. అక్కడి నుంచి శివాలయానికి వెళ్లారు. శివుడికి అభిషేకం జరిపించిన శర తుడు, నందుడిని దీపారాధన చేసి శ్లోకాలు పాడమన్నాడు. భక్తిభావంతో నందుడు తనను తాను మరిచిపోయి పాడుతుంటే, అందరూ అతని గాత్రం విని తన్మయత్వం చెందారు. అతడి ప్రతిభను నోరారా పొగిడారు.

మరుసటి రోజు గురుశిష్యులిద్దరూ, ఆశ్రమానికి తిరుగుప్రయాణమయ్యారు. దారిలో శరతుడు, 'నందా, నీ రంగూ, రూపూ, స్థాయీ, నీ లోపాలని తలిచి నీవు విద్యకు అర్హుడికి కావనుకున్నావు కదా, నీవు ఈ ప్రయాణంలో, నేలపై నడిచావు, నీటిలో ఆడావు. గాలిని పీల్చావు, చెట్టును తాకావు. దీపాలు వెలిగించావు. ఆకాశం క్రింద నిదురించావు. మరి ఇందులో ఏవైనా నీలోపాలను చూసి నిన్ను వెక్కిరించాయా? వాటి వద్దకు రావద్దని హెచ్చరించాయా?'

'లేదు గురువుగారు.'

'చూశావా, ప్రపంచంలో అన్నింటికన్నా గొప్పవైన పంచభూతాలు నీలో ఏ లోపాలు లేవని, నీవు వాటితో కలిసి బ్రతకడానికి అర్హు డివని నిర్ణయించాయి. నీ గాత్రంలో సర స్వతీ దేవిని కొలువుంచినావు. నీ మనసులో మానవత్వం, ప్రేమా నింపావు. అలాంటి నీవు విద్యకు అర్హుడివి కావని ఎలా భావిం చావు? రంగున్న మనిషి ప్రకాశవంతంగా కనబడతాడన్నది నిజమే కాని మనిషి ప్రకా శించేది రంగూ రూపుతో కాదు. విద్యతో, జ్ఞానంతో, అన్నింటికన్నా ముఖ్యమైన ప్రేమ మానవత్వంతో.'

గురువుగారి మాటలతో నందుడి మన సులో ఉన్న భయాలన్నీ తొలిగిపోయాయి. ఈ ప్రపంచం ఎంత గొప్పదో, తన చేయి పట్టి ప్రేరణ ఇచ్చిన గురువు ఎంత గొప్పవాడో అర్థమైన నందుడు సంతోషంగా, హుషా రుగా ఆశ్రమంకేసి నడవసాగాడు.

నందుడి కళ్లలో కనిపించిన సంతోషం చూసి శరతుడు ఆనందభరితుడయ్యాడు.





# పిసినారి యాచకుడు

అనగనగా ఒక రాజు, ఆయన చాలా దయామయుడు. ఎవరి బాధలు విన్నా ఇట్టే కరిగిపోయి, చేతికి ఏది వస్తే అది అంటే నగలు, బంగారం, వజ్రాలు, ధనం ఇచ్చేసేవాడు.

ఆ రాజుగారు ఒకసారి రథం మీద ఒక బీద బిచ్చగాడి ఇంటి మీదుగా వెళ్లటం జరిగింది. అది చూసిన వాళ్లు ఎంతో ఉద్వేగానికి లోనయ్యారు.

ఆ సమయంలో ఆ యాచకుని పాత్రలో ఒక గృహస్థుడు కొంత బియ్యం పోస్తున్నాడు. సరిగ్గా అప్పుడే రాజుగారిని చూసిన యాచకుడు ఆ గృహస్తును పక్కకు నెట్టివేసి, పరిగెత్తుకెళ్లి రాజుగారి ముందు చేతులు జోడించి నిల్చుని నమస్కారం చేశాడు.

'మహారాజా, బీదవారికి మీరు చేసే సహాయం, అడిగినవారికి లేదనకుండా దానం చేసే మీ గుణాన్ని ఎంతో మంది పొగుడుతుంటే విని, ఎన్నాళ్లనుంచో తమ దర్శనం కోసం ఎదురుచూస్తున్న నాకు, తమరు ఇలా కనిపించడం కలో నిజమో తెలియని అయోమయంలో ఉన్నాను. నేను ఏం మాట్లాడుతున్నానో నాకే తెలియటం లేదు. మిమ్మల్ని ఇలా దారిలోనే నిలబెట్టి మాట్లాడుతున్నందుకు క్షమించండి. నేను ఏదయినా తప్పుగా మాట్లాడితే మన్నించండి,' అన్నాడు యాచకుడు. రాజును, ఆయన దాతృత్వాన్ని వేనోళ్ల పొగిడాడు.

రథాన్ని ఆపిన రాజుగారు, 'ఎవరు నువ్వు?' అని అడిగాడు.

'అయ్యా, తమరి పాలనలో ఉన్న ప్రజానీకంలో అత్యంత దురదృష్టవంతుణ్ణి నేను.

ఎమ్. మదనమోహన్ రావు

దారిద్ర్యం నా యింట్లో తిష్టవేసి నేను ఎక్క డికి వెళ్తే అక్కడికి విశ్వాసపాత్రురాలైన కుక్కలా అనుసరించి వస్తుంది. నిన్న మధ్యాహ్నం నుంచి ఇప్పటిదాకా తినటా నికి ఏమీ దొరకలేదు. ఆకలితో కడుపు నకనకలాడుతోంది. కనికరించండి,' అని వేడుకున్నాడు బిచ్చగాడు.

'మీ రాజుకు సమర్పించడానికి నీ దగ్గర ఈ దీనగాథ తప్ప ఇంకేమీ లేదా? ఏదో ఒకటి ఇవ్వు,' అన్నాడు రాజు చేయి చాపుతూ.

బిత్తరపోయిన బిచ్చగాడు జాగ్రత్తగా లెక్కబెట్టి తన బిక్షాపాత్రలోని బియ్యంలో నుంచి ఒక అయిదు బియ్యం గింజలు రాజుగారి చేతిలో పెట్టాడు.

రాజు మాత్రం ఏమీ ఇవ్వకుండా వెళ్లి పోయాడు.

నిరాశ చెందిన యాచకుడు రాజుగారి పిసినారితనాన్ని పదే పదే తిట్టుకున్నాడు తన కసి తీరేదాకా. ఆ తర్వాత బిక్షాటనకు బయలుదేరాడు.

చీకటి పడే వేళకు తన ఇంటికి తిరిగి వచ్చిన అతనికి ఇంటిముందు ఒక నిండు బస్తా కనిపించింది.

'ఎవరో ధర్మాత్ముడు నా కోసం ఇక్కడ పెట్టించి ఉంటాడు,' అనుకుంటూ, ఆ బస్తాను లోపలికి లాక్కెళ్లి, అందులో నుంచి దోసిలితో కొంత బియ్యం బయటికి తీశాడు.

ఆశ్చర్యం! అందులో ఒక బంగారం ముక్క ఉంది. దాంతో రాజుగారే ఆ బియ్యం బస్తాను అక్కడ పెట్టించి ఉంటా రని అర్థమైంది.

ఇంకా ఏమున్నాయో, అనుకుంటూ ఆ బియ్యం మొత్తం నేలమీద కుమ్మరిం చాడు. అందులో ఇంకో నాలుగు బంగారం ముక్కలున్నాయి. అంటే అయిదు గింజ లకు అయిదు ముక్కలన్నమాట.

'రాజు కాదు పిసినారి నేనే. నా పాత్రలోని బియ్యం మొత్తం ఆయనకు ఇచ్చి ఉంటే ఎంత ధనవంతుణ్ణి అయ్యేవాడినో కదా!' అని చింతించాడు యాచకుడు.





# భైరవశాస్త్రి

పూర్వం కళింగ దేశాన్ని మణిభద్రుడనే రాజు పరిపాలించాడు. ఆయన మంత్రి ఇందుశర్మ చాలా తెలివిగలవాడు. రాజుగారి నౌకర్లు లగాయతూ రాజబృందమంతా ఇందుశర్మ చెప్పుచేతలలో ఉంటూ ఉండటం చేత రాచకార్యాలు అవిఘ్నంగా సాగిపోతూ ఉండేవి.

రాజుగారికి కాలక్షేపం చెయ్యటానికి గాను భైరవశాస్త్రి అనే ఆయన ఏర్పాటయ్యాడు. ఆయన నిత్యమూ రాజుగారి వద్దకు వెళ్లి ఆయనకు విశ్రాంతి ఉన్న సమయంలో వినోదం కలిగించి వెళ్ళిపోతూ ఉండేవాడు.

భైరవశాస్త్రికి రాజుగారితో తప్ప మరెవరితోనూ పనిలేదు. అందుచేత ఆయన ఇతరుల నెవరినీ ఖాతరు చేసేవాడు కాడు. రాజుగారికి తనపై అనుగ్రహం ఉన్నంత కాలమూ రాజపరివారంలో ఎవరినీ తాను లక్ష్యపెట్టనవసరం లేదని ఆయన అనుకున్నాడు. ఆఖరుకు మంత్రిగారి పట్ల కూడా ఆయన నిర్లక్ష్యంగా ప్రవర్తించసాగాడు. ఇది చూసి మంత్రి గారికి ఆగ్రహం వచ్చింది. ఆయన ఈ భైరవ శాస్త్రికి ఉద్వాసన చెప్పాలని నిశ్చయించి రాజద్వారం వద్ద కాపలా ఉండేవాణ్ణి పిలిచి, 'ఒరే రేపు లగాయతు భైరవశాస్త్రిని లోపల అడుగు పెట్టనివ్వకు,' అని చెప్పాడు.

మర్నాడు భైరవశాస్త్రి రాజదర్శనం కోసం వస్తూ ఉండగా ద్వారం వద్ద ఉన్న భటుడు, 'తమరు లోపలికి వెళ్లటానికి వీలులేదు. తమరిని రానివ్వవద్దని ఉత్తరువయింది,' అని చెప్పాడు.

చిదానంద

భైరవశాస్త్రి ఆశ్చర్యపోయాడు. ఇందులో ఏదో పొరపాటుందనుకున్నాడు. ఆ క్రితం రోజు కూడా రాజుగారు తనతో కులాసాగా మాట్లాడారు. ఇంతలోనే ఏమి జరిగుంటుందో ఆయనకు అర్థం కాలేదు.

'మహారాజా, నాకు ఎందుకు ఉద్వాసన చెప్పారు! నా వల్ల జరిగిన తప్పేమిటో సెలవిస్తే దిద్దుకుంటాను,' అని ఒక ఉత్తరం రాసి భైరవశాస్త్రి లోపలికి పంపించాడు.

ఆ ఉత్తరం మంత్రిగారిదాకా వెళ్లి ఆ తరవాత బుట్టదాఖలయింది.

రెండు రోజులుగా భైరవశాస్త్రి రాకపోవటం గమనించి రాజుగారు, 'ఈ మధ్య భైరవ శాస్త్రి కనిపించటం లేదు. ఎందు చేత?' అని తన సేవకులను అడిగాడు.

ఎవరినడిగినా తమకు తెలియదన్నారు. ఈ ప్రశ్న మంత్రిగారిదాకా వెళ్లింది. ఆయన వచ్చి రాజుగారితో, 'మహాప్రభూ, భైరవ శాస్త్రి ఖాయిలాపడి నిన్న రాత్రే మరణించాడు. ఆయనకు అంత్యక్రియలు కూడా జరిపించి వచ్చాను,' అన్నాడు.

రాజుగారి వద్దనుండి ఏ జవాబూ లేకపోవడం చూసి భైరవశాస్త్రి తన ఉత్తరం రాజుగారికి చేరలేదని గ్రహించాడు. 'నాకు రాజప్రాంగణంలో మిత్రులెవరూ లేరు. రాజుగారు బయటికి వచ్చినప్పుడు ఆయనతో నేరుగానే చెప్పుకుంటాను,' అనుకుని ఆయన ఆ రోజు నుంచి అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాటి సాయంకాలం రాజూ, మంత్రీ ఇతర పరివారమూ గుర్రాలెక్కి వాహ్యాళికి బయలు దేరారు. రాజుగారికి అంతదూ



రాన భైరవశాస్త్రి కనిపించేసరికి ఆయనకు ఎక్కడ లేని ఆశ్చర్యమూ కలిగింది. 'మంత్రీ, అడుగో భైరవశాస్త్రి! బతికే ఉన్నాడే? చని పోయాడంటివే?' అని రాజు మంత్రిని అడిగాడు.

అందుకు మంత్రి ఏ మాత్రమూ తడు వుకోకుండా, 'అవును మహారాజా, భైరవ శాస్త్రి భూతమయ్యాడు!' అన్నాడు.

మిగిలినవారు మంత్రి ఎంత చెబితే అంతే, 'అవును, మహారాజా ఆ కనిపించేది భైరవశాస్త్రి భూతం!' అన్నారు.

ఈ మాటలను భైరవశాస్త్రి విన్నాడు. ఆయనకు తన బుద్ధి పొరపాటు తెలిసి వచ్చింది. ఆయన ఒక చీటీమీద ఒక శ్లోకం రాసిపెట్టుకుని, రాజుగారు ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడు ఆయన చేతికి అందించాడు. రాజుగారు ఆ చీటి విప్పి ఈ విధంగా చదువుకుంటున్నాడు.

'రాష్ట్రఃసేవ్యో, నృపఃసేవ్యః
నసేవ్యః కేవలో నృపః
రాష్ట్రవక్ర ప్రభావేన
భైరవో భూతతాంగతః'

(రాజుతో బాటు పరివారాన్నీ సేవించాలి, రాజును మాత్రమే సేవించరాదు. పరివారం అనుగ్రహం చాలనందున భైరవుడు బతి కుండగానే భూతమయ్యాడు)

రాజుకు జరిగిన సంగతి అర్థమైంది. ఆయన తన మంత్రితో, 'భైరవశాస్త్రి పోయా డనీ భూతమయ్యాడనీ నాతో అబద్ధాలు చెప్పారా?' అని అడిగాడు.

మంత్రిగారు జరిగినది జరిగినట్లుగా చెప్పాడు. ఒక విదూషకుడి కోసం సమర్థు డైన మంత్రిని పోగొట్టుకోలేడు గనక రాజు మంత్రిని ఏమీ అనక, భైరవశాస్త్రిని తిరిగి కొలువులో పెట్టమని మాత్రం అన్నాడు.

భైరవశాస్త్రి కూడా ఈసారి మంత్రికీ ఇతర అధికారులకూ తగిన వినయవిధే యతలు చూపుతూ రాజుగారి సేవ చేశాడు.





# పాపడి పద్దు పుస్తకం

మాంచాలవరం అనే గ్రామంలో పాపడు అని ఒక తోటకాపు ఉండేవాడు. పాపడు ఏపైన కూరలు పెంచడంలో ఎంతో ప్రావీణ్యుడు. వాడు తనకున్న కొద్దిపాటి భూమిలోనే చక్కగా ఎరువులు తోలి, మడులు వేసి, కాయగూరలు పండించి వాటిని మంచి ధరకు అమ్మి, వచ్చిన డబ్బుతో తృప్తిపడి కాలక్షేపం చేస్తుండేవాడు.

తాను పెంచే కాయగూరలమీద వాడికెంత ప్రేమంటే, తనకు నచ్చిన పెద్ద పెద్ద గుమ్మడి కాయలు మొదలైన వాటికి వాడు ముద్దుపేర్లు కూడా పెట్టుకునేవాడు.

ఆ గ్రామంలోనే గవరన్న అని మరొక తోటకాపు ఉండేవాడు. పాపడి పొలం కంటే గవరన్న పొలం పెద్దది కూడానూ, అయినా గవరన్న ఎంతసేపూ డబ్బు సంపాదించాలన్న దుగ్ధే తప్ప, కూరలు పెంచటంలో కొంచెమైనా తెలివితేటలు గాని, ఓపిక గాని లేదు. పాపడి కూరలకు వచ్చే ధర గవరన్నకు ఏనాడూ పలికేది కాదు.

'నువు కాస్త చదువుకున్న వాడివి, ఆ పాపన్నకు ఏ చదువూ లేదు. కాని నువు వాడితో సమంగా కాయలు పండించలేవు,' అని గవరన్నను అందరూ ఎద్దేవా చేసేవారు.

ఒక ఏడు పాపడు అత్యద్భుతమైన మంచి గుమ్మడి కాయలు పండించాడు. అంత పెద్ద గుమ్మళ్లను ఎవరూ ఎన్నడూ చూసి ఉండలేదు. పాపడి ఆనందానికి మేరలేదు. ఎంతో ప్రేమతో, వాడా కాయ

ఆర్. శకుంతల

లకు ఐరావతం, పానకం బిందె మహా లక్ష్మి, పెద్దక్క, బంగారం అని రకరకా లుగా పేర్లు పెట్టుకున్నాడు. ఆ యేడు ఇటువంటి పెద్దకాయలు నలభై దాకా పాపడి పాదులకు కాశాయి.

రేపు సంత అనగా పాపడు తన తోటకు వెళ్లి ఏయే గుమ్మడి కాయలను కోసి తీసుకుపోవాలో గుర్తుపెట్టుకుని, తెల్ల వారుతూనే బండితో సహా రావడానికి నిర్ణయించుకుని ఇంటికి వెళ్లాడు. ఆ రాత్రి పాపడికి నిద్రపట్టలేదు. ఆ కాయ లను తన చేతిమీదుగా సంతలో అమ్మట మంటే, కనిపెంచిన కూతుళ్లను అత్త వారిళ్లకు పంపటమే అనిపించిందివాడికి.

మర్నాడు తెల్లవారుతూనే లేచి బండి కట్టుకుని పాపడు తోటకు వెళ్లాడు. గుమ్మడి పాదుల మధ్యకు వెళ్లేటప్పటికి పాపడి గుండె గుబుక్కుమన్నది. పెద్ద గుమ్మడికాయలు అన్నిటినీ ఎవరో కోసు కుపోయారు. పాపడికి మతి పోయినట్ల యింది. పిచ్చివాడల్లే పాదుల మధ్య చాలాసేపు తిరిగాడు. తన గుమ్మడి కాయలను కాజేసిన వాళ్లను తిట్టుకు న్నాడు.

అంతలో పాపడికొక ఆలోచనొచ్చింది. ఒకటీ, రెండూ కాదు నలభై గుమ్మడి కాయలు. ఎక్కడికి పోగలవు? పోతే సంతకే పోవాలి. వాటిని తను ఎక్కడున్నా గుర్తుపట్టగలడు.

వెంటనే పాపడు బండి ఎక్కి సంతకు బయలుదేరాడు. ఒక గంటలో అక్క డికి చేరి కాయగూరల దుకాణాలన్నీ



చూడసాగాడు. ఒక దుకాణంలో వాడికి తన గుమ్మడి కాయలన్నీ ఒక్క కుప్పలో కనిపించాయి. పాపడు చప్పున దుకాణం వాడి దగ్గరకు పోయి, 'ఇదే పని? దొంగ పని. నా గుమ్మళ్లు కాజేసి నీ కొట్లో అమ్మ కానికి పెడతావా?' అన్నాడు.

దుకాణం వాడు నిర్ఘాంతపోయి, 'ఇవి నేను దొంగతనం చేయలేదు. మీ ఊరి గవరన్న ఈ పూటే నాకివి అమ్మి పదిరూపాయలు పట్టుకు వెళ్లాడు,' అన్నాడు.

'గవరన్న ఇంకా తిరిగి పోలేదు. అవ తల ఇంకో అంగడిలో ఉన్నాడు.' అని పక్కనున్న వాళ్లెవరో చెప్పారు.

పాపడు వెంటనే సంతలో ఉండే అధి కారి దగ్గరికి వెళ్లి గవరన్న తన గుమ్మడి కాయలు తెచ్చి సంతలో అమ్మేశాడని ఫిర్యాదు చేశాడు. గవరన్నను నలు గురూ కలిసి దుకాణానికి తెచ్చారు.

'ఈ గుమ్మడి కాయలు నీవేనని నీకెట్లా తెలుసు?' అని అధికారి పాపడి నడిగాడు.

'నాకు తెలియక పోవడమేమిటి? నే పెంచినవే గా? ఇదుగో మహాలక్ష్మి. ఇదుగో ఐరావతం!' అంటూ ఒక్కొక్క కాయనే పాపడు చూపసాగాడు.

పాపడి అమాయకత్వానికి నవ్వారు. అధికారి కూడా అందరూ నవ్వుతూ, 'ఈ కాయలను నువు గుర్తించడం కాదు. ఇవి నీవేనని ఇతరులు గుర్తించే సాక్ష్యం ఏదైనా ఉండాలి,' అన్నాడు. పాపడికి ఏమీ పాలుపోలేదు.



అధికారి గవరన్న కేసి తిరిగి, ''ఏమోయ్, ఈ గుమ్మడి కాయలు నువు దొంగిలిం చావని పాపన్న అంటున్నాడే? ఏమం టావు?' అని అడిగాడు.

'వాడు అమాయకుడు లెండి. నా దగ్గర నేను పండించే కూరల లెక్కలూ, వాటి అమ్మకం లెక్కలూ రాసిన పద్దు పుస్తకం ఉన్నది. కావలిస్తే ఇప్పుడు పోయి తీసుకురాగలను,' అని గవరన్న చెప్పాడు.

ఈ మాట వినగానే, పాపడు 'అయ్యా, అవి నా కాయలే అని చూపడానికి నా దగ్గరా గొప్ప పద్దు పుస్తకం ఉంది. నేనూ తెస్తా!,' అన్నాడు. ఈ మాట విని గవ రన్న విరగబడి నవ్వాడు

అధికారి భటులను వెంట ఇచ్చి ఇద్ద రినీ వాళ్ల గ్రామానికి పంపాడు. కొంతసే పటికి ఇద్దరూ తిరిగి వచ్చారు. గవరన్న తన పద్దు పుస్తకం తెచ్చాడు. పాపడు తన పైబట్ట కొంగున ఏవో మూట కట్టితెచ్చాడు.

గవరన్న పద్దు పుస్తకంలో తాను ఆ రోజే నలభై గుమ్మడికాయలు తన తోట నుంచి కోసి సంతకు పట్టుకెళ్లినట్లు పద్దు న్నది.

'నీ పద్దు మాటేమిటి?' అని అధికారి పాపడి నడిగాడు.

పాపడు మూట విప్పి నలభై గుమ్మడి తొడిమలు తీసి, 'అయ్యా ఇదుగో నా పద్దు!' అన్నాడు. వాడు ఒక్కొక్క తొడిమే తీసి, ఒక్కొక్క గుమ్మడికాయకు తగి లించి, అన్ని తొడిమలూ అన్ని కాయ లకూ ఎంత బాగా అతికాయో చూపాడు.

గవరన్న ససాక్ష్యంగా దొరికి పోవడంతో వెంటనే అధికారి గవరన్న చేత పాపడికి గుమ్మడికాయల డబ్బు ఇప్పించేశాడు. ఆనాటినుంచి వాళ్ల గ్రామంలో గవర న్నను అందరూ 'గుమ్మడి కాయల దొంగ' అని పిలవసాగారు.






# తగిన అభ్యర్థి

రామచంద్రపురంలో రామయ్య అనే ఆసామి అంతో ఇంతో కలిగిన వాడు. పట్నంలో దినుసుల వ్యాపారం చేసి ఓ మోస్తరుగా వెనకేశాడు.తన వ్యాపారాన్ని విస్తరించాలని తలచిన రామయ్య, తన వ్యవహారాలను చక్కబెట్టే నిపుణుడిని నియమించుకోవాలని భావించాడు.

ఒకరాత్రి రచ్చబండ దగ్గర తన స్నేహితుడు చంద్రయ్య తారసపడగా, ఆపి ఈ విషయంపై సలహా అడిగాడు.

చంద్రయ్య కొద్ది సేపు ఆలోచించి 'మా బంధువుల్లో ఇద్దరు యువకులున్నారు. జమీందారీ దివాణంలో మంచి పదవులు అలంకరిస్తున్నారు. వీరిరువురినీ మీరు పరిశీలించవచ్చు' అన్నాడు చంద్రయ్య.

రామయ్య నవ్వి, 'నీకభ్యంతరం లేక పోతే వారిద్దరినీ నేనుపరీక్షిస్తాను. చుట్టం చూపుగా వాళ్లను నీ ఇంటికి ఆహ్వానించ రాదూ!' అన్నాడు స్నేహితుడి వంక చూసి.

రెండు రోజుల తర్వాత చంద్రయ్య ఇంట దిగారు జ్ఞానేంద్రుడు, శివుడు. చంద్రయ్య కబురందుకుని ఒకరోజు ఉదయానే చంద్రయ్య ఇంటికెళ్లాడు రామయ్య. వాకిలి అరుగుమీద జ్ఞానేంద్రుడు, శివుడు చదరంగం ఆడుతున్నారు.

కొద్ది సేపటి తర్వాత రామయ్య చంద్రయ్యను ఉద్దేశించి 'రోజురోజుకూ ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ముందురోజుల్లో బతకడం ఎవరికైనా కష్టమే' అన్నాడు ఎంతో దిగులుగా.

శివుడు కల్పించుకుని 'ధరలు మండి పోవడం పెద్ద విషయం కాదు. అందుకు తగ్గ సంపాదన కోసం ఒళ్లొంచి పాటుపడాలి. ఇప్పుడు ధనసంపాదన కోసం అనేక

జి. ప్రియరాణి



మార్గాలు ఉండనే ఉన్నాయిగా' అన్నాడు.

జ్ఞానేంద్రుడు మౌనంగా ఉండటం చూసి, 'నీవేమంటావు?' అని అడిగాడు రామయ్య ఆసక్తిగా.

జ్ఞానేంద్రుడు నిట్టూర్చి 'శివుడి అభిప్రాయంతో నేను ఏకీభవించలేను. ధరలు అదుపులో ఉండకపోతేనే.. కోర్కెలను అదుపులో ఉంచుకోవచ్చుగా. తాహతుకు మించి ఆలోచిస్తే ఎంత సంపాదించినా సరిపడదు. అత్యాశ అనక అనేక ఆటుపోట్లకు కారణమవుతుంది!' అన్నాడు.

తిరిగి రామయ్య, 'లోకంలో అరాచకాలు మితిమీరిపోయాయి. చిన్న చేపలు బతకటం కష్టమే. కలిగిన వాళ్ళు, బలవంతులు తమ కిందివారిని అణిచి వేయడానికి చూస్తున్నారు. బలహీనులు నిస్సహాయులుగా కుమిలిపోతున్నారు. లోకం తీరు ఎప్పుడు మారుతుందో!' అన్నాడు బాధగా.

వెంటనే శివుడు 'మారని లోకం తీరు గురించి ఎదురు చూసేకన్నా మనుషులే వాళ్ళ తీరు పూర్తిగా మార్చుకోవాలి. ఎదిరించే సత్తా కలిగి ఉంటే చాలు జోలికి రావడానికి ఎవ్వరైనా భయపడతారు. ఎవరికైనా ఈ రోజుల్లోనూ కండబలం అవసరం!' అన్నాడు.

జ్ఞానేంద్రుడు ప్రశాంతంగా నవ్వి, 'శివుడి అభిప్రాయంతో నేను అస్సలు ఏకీభవించలేను. ఎవరికైనా బుద్ధిబలమే ముఖ్యం. ఎదురుతిరిగితే అది మరింత జటిల సమస్యలకు, ప్రాణహానికి కూడా దారి తీయవచ్చు. బతకడానికి ప్రతి ఒక్కరికీ స్వేచ్ఛ ఉన్నట్లే అందరికీ సరైన మనస్సాక్షి ఉంటే చాలు. ఏ విధమైన తారతమ్యాలు లేకుండా అందరూ వారివారి పరిధుల్లో ఉండగలుగుతారు. అసలు మనస్సాక్షిని మించిన న్యాయస్థానం మరొకటుందా? అని తన అభిప్రాయం చెప్పాడు.

అంతలోనే చంద్రయ్య ఇంటికి కాస్త దూరంలో ఉన్న ఊరి రచ్చబండ దగ్గర చిన్న కలకలం వినిపించింది. రామయ్య, చంద్రయ్యలు అక్కడకెళ్తుంటే జ్ఞానేంద్రుడు, శివుడు కూడా వాళ్లను అనుసరించారు.

రచ్చబండ దగ్గర ఊరుఊరంతా పోగయ్యింది. రెండు దినాల నుండి సాగుతున్న తంతే. వీరడు, రంగడు అనే ఇద్దరు యువకులు యధావిధిగా తమ తమ వాదనలను గ్రామాధికారికి వినిపిస్తున్నారు.

తన ప్రక్కన నిలబడ్డ జ్ఞానేంద్రుడు, శివుడితో రామయ్య 'వీరడి బర్రెను రంగడు దొంగిలించి సంతలో తెగనమ్ముకున్నాడని వీరడి ఫిర్యాదు. రంగడు ససేమిరా అంటు న్నాడు. రెండు దినాల నుండి ఇదే తగవు. మీరు చదువులో రాణించారు. లోకజ్ఞానం సంపాదించుకున్నారు. వారిద్దరిలో ఎవరి వాదన సబబో నిర్ణయించగలరా!' అన్నాడు.

శివుడు పెదవి విరిచాడు. జ్ఞానేంద్రుడు క్షణమాలోచించి 'వీరడి ఫిర్యాదు సబబైనదే. రంగడు దొంగతనం చేశాడన్నది వాస్తవమే. మీరే చూస్తారుగా!' అనేశాడు ఏమాత్రం తడుముకోకుండా.

కొద్ది సేపటికి జ్ఞానేంద్రుడు చెప్పినట్లే వీరడి బర్రెను రంగడు దొంగిలించి తెగన మ్ముకొన్నాడని రూఢీ అయింది. రంగడిని గ్రామసేవకులు బంధించి తీసుకుపో యారు. రామయ్య, చంద్రయ్య లిద్దరూ జ్ఞానేంద్రుడి తెలివికి ఆశ్చర్యపోయారు.

ఇంటికి తిరిగివస్తుండగా రామయ్య జ్ఞానేంద్రుడి వంక నవ్వుతూ చూసి 'రంగడు దొంగతనం చేశాడని అంత ఖచ్చితంగా ఎలా నిర్ధారించగలిగావు. నాకూ తెలు సుకోవాలన్న ఆసక్తి ఉంది,' అనేశాడు. చంద్రయ్య కూడా ఆసక్తి చూపించాడు.

జ్ఞానేంద్రుడు నవ్వి 'వాదులాడుతున్న ఇరువురిలో ఒకవైపే న్యాయముంటుంది. ఇక్కడే ఉంది అసలు మెలిక. నేరస్థుడె ప్పుడూ హెచ్చుస్వరంతో వాదులాటకు దిగుతాడు. నేరం చెయ్యని వాడు న్యాయం తన వైపే ఉన్నవాడు పొడిపొడిగా మాట్లా డుతూ తనకు న్యాయమే జరుగుతుందన్న భరోసాతో నిశ్చలంగా ఉంటాడు. రంగడి హెచ్చుస్వరమే అతని నేరస్వభావానికి ప్రత్యక్ష తార్కాణం,' అన్నాడు.

జ్ఞానేంద్రుడిని రామయ్య అభినందిం చకుండా ఉండలేకపోయాడు.

జీవితం పట్ల లోకం తీరుమీద నిఖా ర్సయిన నిబద్ధత,.. న్యాయమైన అవగా హన కలిగిన జ్ఞానేంద్రుడినే తన వ్యాపార కార్యనిర్వాహకుడి గా చేసుకున్నాడు రామయ్య.





# తగిన శిక్ష

బడి గంట మోగింది. పిల్లలంతా బిలబిల లాడుతూ వచ్చారు. ప్రార్థన ముగిశాక ఎవరి తరగతుల్లోకి వారు కదిలారు.

ఏడో తరగతిలోకి వెళ్లిన చంద్రం మాస్టారు పిల్లలకు హాజరు వేయసాగారు. అప్పుడే అరుణ అనే అమ్మాయి పేరు పిలిచారు. పలకకపోవటం చూసి ఎందుకు రాలేదని అడిగారు. వనిత అనే అమ్మాయి లేచి, 'సార్, అరుణ ఎందుకు రాలేదో నాకు తెలుసు,' అంది.

చెప్పమన్నట్లుగా చూశారు మేస్టారు.

'అరుణ పక్కింట్లో దొంగతనం చేసింది. ఎంత అడిగినా చెప్పకపోయేసరికి వాళ్లు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఇది తెలిసి వాళ్ల అమ్మ నాన్న తలెత్తుకోలేకపోతున్నారు. మొహం చూపించలేకనే రాలేదు,' అని చెప్పి కూర్చున్నది వనిత.

నమ్మలేనట్లుగా చూశారు చంద్రం మాస్టారు. ఆ వార్త విన్నది మొదలు పిల్లల్లో గుసగుసలు ప్రారంభం... మరి రెండు రోజులు కూడా అరుణ రాకపోవడంతో అనుమానం బలపడింది.

ఇది జరిగిన మూడో రోజు అరుణ వచ్చింది. ఏమీ ఎరగనట్లుగా ఉండటంతో అందరూ విస్తుపోయారు. మొదటి పీరియడ్ వచ్చేది చంద్రం మాస్టారే! అరుణను చూస్తూనే 'నువ్వు చేసిన పని ఏమిటో తెలిసిపోయింది. అందుకే బడి ఎగ్గొట్టావు. లే... నిల్చో, నిన్ను శిక్షించాలి,' అన్నారు కొద్దిగా కోపం ప్రదర్శిస్తూ.

అరుణ భయంగా లేచి నిలబడి 'సార్ నేనేం తప్పు చేశాను,' అన్నది.

'మరి ఈ రెండు రోజులు ఎందుకు బడికి రాలేదు. టీచర్‌తో చెప్పాలా వద్దా!' అని నిలదీశారు చంద్రం మాస్టారు.

'మరి. నేను.. నేను..' అంది అరుణ

కె.కె. రఘునందన

నానుస్తూ: 'ఊళ్లంట తిరుగుతూ కాలక్షేపం చేస్తున్నావు. అంతేనా! అందుకు సాక్ష్యం వనిత. లేమ్మా వనితా! ఏమర్రా పిల్లలూ ఈ వనిత చెప్పిన ప్రకారమైతే నేరం చేసిన వాళ్లను శిక్షించాలి కదూ. అందుకనే మరి ఈ వనితను శిక్షిద్దామా మరి!' అని అందరి వైపూ చూసారు.

అంతా విడ్డూరంగా చూసి, 'అదేంటి మేస్టారూ, అరుణ తప్పు చేస్తే వనితను శిక్షిస్తారా, పాపం!' అన్నారు విచారంగా.

'ఔను! అరుణ తప్పు చేసినట్లుగా చెప్పిన వనితదే తప్పంతా, అందుకే ఆ అమ్మాయినే శిక్షించాలి,' అన్నారు మాస్టారు.

ఆయన మాటలకు మరింతగా విస్తుపోయారు పిల్లలు.

'మరేంలేదు. అరుణ మీద కోపంతో, అసూయతో ఉన్న వనిత అరుణపై నిందను ఎలాగైనా మోపాలని ఇలా చేసింది. రెండు రోజులూ అరుణ వరదబాధితుల కోసం విరాళాల సేకరణకు ఊళ్లోవారి వెంట తిరిగింది. డబ్బులు పోగు చేసింది. కానీ, ఈ విషయాన్ని మార్చి ఆమె దొంగతనానికి పూనుకుందని అబద్ధం చెప్పింది వనిత. అందుకే ఆ అమ్మాయిని ఎంతగా శిక్షించినా ఫర్వాలేదు.' అనగానే వనిత మొహం మాడిపోయింది.

'ఎవరిపైన అయినా అసూయ, కోపం ఉంటే అణచుకోవాలి తప్ప, ఇటువంటి అబద్ధాలాడకూడదు. తనకంటే అరుణకు ఎక్కువ మార్కులొస్తున్నాయనే వనితకు అసూయని తేలింది. అందుకే ఆ అమ్మాయికి తగిన శిక్ష ఏమిటో తెలుసా!' అని ఆగారు మేస్టారు.

పిల్లలంతా ఉత్కంఠగా చూడసాగారు.

'మరేం లేదు. అరుణకు క్షమాపణ చెప్పి వచ్చే పరీక్షల్లో ఆ అమ్మాయికంటే అర మార్కయినా ఎక్కువ సాధించాలి. అలా కాకపోతే అప్పుడు శిక్ష విధిస్తా!' అనేసరికి వనిత కళ్లలో నీళ్లు తిరిగాయి.

అరుణకు క్షమాపణ చెప్పింది.

వనితను ఏమీ అనని చంద్రం మేస్టారి పెద్ద మనసుకు మెచ్చుకున్నారు పిల్లలు.





# తిమ్మరుసు తెలివి

విజయనగర సామ్రాజ్యానికి గొప్ప కీర్తిని తెచ్చిన శ్రీకృష్ణదేవరాయలు పేరు అందరికీ తెలిసినదే! ఆయన తండ్రి సాళ్వ నరసింహ రాయలు రాజ్య పరిపాలన చేసే కాలంలో ఆయన ప్రధానమంత్రి అకస్మాత్తుగా చని పోయాడు.

బుద్ధిశాలి అయినవాడు లభించినట్ల యితే అతడిని రాజ్యానికి మంత్రిగా వేసు కుంటానని నరసింహరాయలు చాటింపు వేయించాడు.

ఎందరెందరో మంత్రి పదవి అలంక రించడానికి వచ్చారు. కాని వారి తెలివితే టలతో నరసింహరాయలు కొంచెం కూడా తృప్తి చెందలేదు. వచ్చినవారిలో ఏ ఒకడూ ఆయనకు నచ్చలేదు.

చివరకు నరసింహరాయలు ఒక ఉపాయం చేశాడు. ఆయన ఒక కాగితంపై సిరాతో నాలుగు అంగుళాల నిడివి గల ఒక గీత గీసి, దానిని తన చారులకిచ్చి, 'ఈ గీతను చెరపకుండా చిన్నది చేయగలవాడు ఎక్కడైనా ఉంటే నా దగ్గరకు తీసుకు రండి,' అని చెప్పాడు.

చారులు ఆ కాగితాన్ని పట్టుకుని ఊళ్లూళ్లూ తిరిగారు. కాస్త తెలివిగా కన బడ్డవాడికల్లా ఆ కాగితం చూపి, 'అయ్యా, మీరీ గీతను చెరపకుండా చిన్నది చెయ్యగ లరా?' అని అడిగారు.

కొందరు 'అది ఎలా సాధ్యమవుతుంది? అన్నారు. మరికొందరు' మీకేమైనా మతి పోయిందా ఏమిటి? ఉన్న గీతను చెరప కుండా ఎలా పొట్టిచేయడం,' అన్నారు.

కొందరు కోపం తెచ్చుకుని, 'మీకు

టి. రాజగోపాలరావు

మమ్మల్ని చూస్తే వేళాకోలంగా ఉందా ఏమిటి? అని కూడా అడిగారు.

చారులు ఒక్కొక్క గ్రామమే తిరుగుతూ ఒక అగ్రహారం చేరి, అక్కడివాళ్లను కూడా ఇలాగే అడుగుతూ వచ్చారు. ఆ అగ్రహారంలో వారికొక బడి కనిపించింది. ఉపాధ్యాయుడు పిల్లలను కొందరిని పెట్టుకుని చదువు చెబుతున్నాడు.

చారులు ఉపాధ్యాయుడి దగ్గిరికి వెళ్లి, 'అయ్యా, ఈ కాగితం మీద ఉన్న గీత చూశారు కదా, దీనిని చెరపకుండా చిన్నది చెయ్యగలరా?' అని అడిగారు.

ఉపాధ్యాయుడు వాళ్ల మాటలను విని, 'ఆ పని నేను కాదుకదా మరెవ్వరూ చెయ్యలేరు. ఎవరినైనా గారడీవాళ్లను అడిగి చూడండి,' అన్నాడు. చారులు వెనక్కు తిరిగి వెళ్లిపోసాగారు.

ఆ బడిలో పదహారేళ్ల బ్రాహ్మణ కుర్రవాడొకడు చదువుకుంటున్నాడు. అతడి పేరు తిమ్మరుసు. అతను ఉపాధ్యాయుడితో 'అయ్యా, వాళ్లు కోరినది బ్రహ్మవిద్య కాదే. ఆ గీటు పక్కన అంతకంటే పెద్ద గీటు గీస్తే ఆ గీటు చిన్నదైపోదా?' అన్నాడు.

ఉపాధ్యాయుడికి ఈ యుక్తి నిదానంగా అర్థమయింది. వెళ్లిపోతున్న చారులను మళ్ళీ వెనక్కు పిలిచి, 'ఏదీ ఆ కాగితం ఇలా ఇవ్వండి,' అన్నాడాయన. తరవాత నాలుగు అంగుళాల గీత పక్కన అంత కంటే పెద్దగీత గీసి, 'మీరు తెచ్చిన గీత



చిన్నదైపోయింది. ఇక వెళ్లండి,' అన్నాడు.

వెంటనే చారులు పరమానందంతో ఆ ఉపాధ్యాయుడికి నమస్కరించి, 'అయ్యా మేము సాళ్వ నరసింహరాయలు పంపిన దూతలం. ఈ కాగితాన్ని మాకిస్తూ మహారాజుగారు ఈ గీతను చిన్నది చేసినవారిని తమ వద్దకు తీసుకు రమ్మన్నారు. ఎంతో మంది ఈ కాగితాన్ని చూసి కూడా గీతను చిన్నది చెయ్యలేకపోయారు. మీరు కూడా చేయలేకపోయారనే అనుకున్నాము. కాని చివరకు మీ మూలానే ఇన్నాళ్లుగా మేము పడ్డ శ్రమ ఫలించింది. మీకోసం ఇప్పుడే పల్లకీ తీసుకువస్తాం. రాజధానికి బయలు దేరటానికి సిద్ధంగా ఉండండి,' అని శలవు తీసుకున్నారు.



ఉపాధ్యాయుడికి తృప్తి అయింది. ఆయన వెంటనే గ్రామంలోకి వెళ్లి అందరికీ తనకు జరుగబోయే సన్మానం గురించి చెప్పి, చారులు తెచ్చిన పల్లకీ ఎక్కి రాజధానికి వెళ్లాడు.

ఆ పల్లకీలో వచ్చిన ఉపాధ్యాయుడు కాగితం మీది గీతను ఎలా చిన్నది చేసినదీ చారులు చెప్పగా విని నరసింహరాయలు చాలా సంతోషించాడు.

కాని చూడటానికే మూఢుడులాగున్న ఆ ఉపాధ్యాయుడు బుద్ధిశాలి అని ఆయనకు ఒక పట్టాన నమ్మకం కుదరలేదు. అందుచేత ఆయన ఉపాధ్యాయుడికి మరొక పరీక్ష ఏర్పాటు చేశాడు.

ఉపాధ్యాయుడి మనస్సులో ఆనందం పొంగి వచ్చింది. ఆయన తిమ్మరుసుతో 'ఒరే, బాబూ, రాజుగారు ఏదో కానుక ఇస్తారు లాగుంది. నిజానికి ఆ కానుక నీకు రావలసినదే అయినా ఈ సారికి నన్ను తీసుకోనీ, ఇదే నాకు నువ్విచ్చే గురుదక్షిణ అనుకో. నీవా చిన్నవాడవు, తెలివి గలవాడవు, ముందు ముందు ఎంతలేసి బహుమానాలైనా పొందుతావు. ఈ రహస్యం ఎక్కడా చెప్పకు,' అని బతిమాలుతూ అన్నాడు.

తిమ్మరుసు నవ్వి, 'గురువుగారూ, ఇంతగా నాతో ఎందుకు చెబుతున్నారు? ఆ గీతను చిన్నది చేసింది మీరేగాని నేను కాదే?' అన్నాడు.

దర్బారులో ఒకచోట ఒకపీటమీద కొన్ని ముద్రికలు ఉంచారు. ఆ పీటచుట్టూ పరుపులు పరిచారు.

తరవాత రాజు ఉపాధ్యాయుడిని దర్బారుకు పిలిపించాడు.

'అయ్యా, ఆ కాగితం మీది గీతను చిన్నది చెయ్యమని పరీక్ష పెట్టినది ఎందుకో మీకింకా తెలియదు. నాకు మంత్రి కావలిసి ఆ పరీక్షలో నెగ్గినవాడికి మంత్రి పదవి ఇవ్వ నిశ్చయించాను.

మీరు ఆ పరీక్షలో నెగ్గారు. కనుక మీకు మంత్రిపదవి ఇస్తున్నాను. మీ పదవికి సంబంధించిన ముద్రికలు ఆ పీటమీద ఉన్నాయి. తెచ్చుకోండి. ఆ పరుపులు మాత్రం తొక్కకండి!' అన్నాడు.

ఏదో బహుమానం దొరుకుతుంది, దాన్ని పుచ్చుకుని అగ్రహారానికి తిరిగి పోదాం అనుకుంటున్న ఉపాధ్యాయుడికి మంత్రి పదవి అనగానే కాళ్లు వణికాయి. ముచ్చెమటలు పోశాయి.

పైగా, పరుపులు తొక్కకుండా పీట వద్దకు వెళ్లి ముద్రికలు తీసుకోవడం ఎలాగో ఆయనకు బోధపడలేదు. అంత పెద్ద సభలోనూ తనకు గొప్ప పరాభవం జరగబోతున్నదని తెలిసి ఆయన కొయ్య బారి అలాగే నిలబడిపోయాడు.

నరసింహరాయలు అనుమానం దృఢ పడింది. ఆయన ఉపాధ్యాయుడితో, 'అలా నిలబడిపోయావేమయ్యా? నీకా ముద్రికలు తీసుకోవడం నిజంగానే చాత కాదా? ఇంతకూ నేను గీసిన పెద్ద గీటును చిన్నది చేసినది నీవా, మరొకరా?' అన్నాడు.

ఉపాధ్యాయుడు వెంటనే రాజు కాళ్లపైన పడి, 'మహాప్రభో, క్షమించాలి. దురాశ చేత అపచారం చేశాను. ఆ గీటును చిన్నది చెయ్యడమెలాగో నాకు యుక్తి చెప్పిన వాడు నా విద్యార్థి తిమ్మరుసు నేను కాను,' అని నిజం ఒప్పుకున్నాడు.

అప్పటికప్పుడే నరసింహరాయలు అగ్రహారానికి మరొక పల్లకీ పంపి తిమ్మరుసును రప్పించాడు.

రాజు అతనితో, 'నేను గీసిన గీటును చిన్నది చేసే యుక్తి చెప్పినవాడవు నీవేనట గదా? నీకు మంత్రిపదవి ఇస్తున్నాము. అవిగో నీ అధికార ముద్రికలు. పరుపులను తొక్కకుండా వెళ్లి వాటిని తెచ్చుకో!' అన్నాడు.

తిమ్మరుసు పరుపులు చుట్టుకుంటూ పీటవద్దకు వెళ్లి, దానిమీద ఉన్న అధికార ముద్రికలు తెచ్చుకున్నాడు.

నరసింహరాయలు అతని యుక్తికి మెచ్చుకుని అతనిని తన మంత్రిగా చేసుకున్నాడు.





# మానవధర్మం

బాల్యమిత్రులైన శరభయ్య, చలమయ్య పార్వతీపురం జమీందారు దివాణంలో ఉద్యోగాలు చేస్తుండేవారు. సమవయస్కులు కావడంతో ఇద్దరికీ ఒకే ఏడాది పెళ్ళిళ్లు జరిగాయి. ఇప్పుడు వారిద్దరి కొడుకులు ఒకే తరగతి చదివే విద్యార్థులుగా ఉంటూ స్నేహితులయ్యారు.

ఒకరోజు చలమయ్య దివాణంలో పని ముగించుకుని ఇంటికొచ్చేసరికి కొడుకు సాంబడు మారాం చేస్తూ కనిపించాడు.

రేపు తన పుట్టినరోజు సందర్భంగా తరగతిలో పిల్లలందరికీ మిఠాయిలు పంచుతానని అవి కొనే నిమిత్తం డబ్బులు కావాలని తల్లిని సతాయించడం చలమయ్య చెవిన పడింది.

'పుట్టినరోజు ఘనంగా జరుపుకోడానికి మనమేమి కోటీశ్వరులమనుకున్నావా? లక్షాధికార్లమనుకున్నావా? నీకు ఏది తినాలనిపిస్తే అది అమ్మచేత వండించుకుని తిను చాలు,' చిరాకుపడుతూ చెప్పాడు చలమయ్య.

'మొన్న నీ బాల్యమిత్రుడైన శరభయ్య కొడుకు సుబ్బరాజు తరగతిలో అందరికీ మిఠాయిలు పంచి పుట్టినరోజు జరుపుకున్నాడు. వాళ్లేమైనా ధనవంతులా?' ఎదురు ప్రశ్న వేశాడు సాంబడు.

కొడుకుతో వాదనకు దిగి లాభం లేదని గ్రహించిన చలమయ్య 'అందరికీ మిఠాయిలు పంచి డబ్బును వృధా చేయడం కన్నా దాంతో నీకు నచ్చిన ఆటబొమ్మ కొంటాను,' అని ఆశ కల్పించి చెప్పాడు.

ఇదేదో బాగున్నట్లుంది అనుకొని ఒప్పుకున్నాడు సాంబడు. అనంతరం తండ్రితో పాటుగా అంగడికి వెళ్లి నచ్చిన బొమ్మ కొని

బి.వి.పట్నాయక్

పించాడు సాంబడు.

రోజులు గడుస్తున్న కొలది సుబ్బరాజు తరగతిగదిలో తోటి పిల్లలకు సాయపడే తీరును ఇంటిదగ్గర తల్లితండ్రులకు పూస గుచ్చినట్లు చెబుతూ తాను కూడా తోటి పిల్లలకు ఏదో ఒక సాయం చేస్తానని దానికి డబ్బులు కావాలని మొండిపట్టు పట్టేవాడు సాంబడు.

సాంబడి మనస్సు మార్చడానికి చలమ య్యకి తలప్రాణం తోకకు వచ్చేటట్టుం డేది. అయినా ఏదో ఒక రూపంలో కొడుక్కి బహుమతులను లంచంగా ఇస్తూ అదు పులో పెడుతుండేవాడు.

సుబ్బరాజు కారణంగా తన కొడుకు పెడుతున్న ఇబ్బందులను ఒకసారి శర భయ్యతో ప్రస్తావించాడు చలమయ్య.

'శరభయ్యా! నీ కొడుకు అందరికీ భిన్నంగా ఉండాలని మిగతా పిల్లలకు ఏదో ఒక సాయం చేస్తూ గొప్పలకు పోతున్నా డట. ఇది అలవాటైతే నీ ఆస్తి మొత్తం హారతి కర్పూరం అయిపోగలదు. ఇంతకీ నీకు తెలిసే ఈ పనిచేస్తున్నాడా?' అంటూ అనుమానం వ్యక్తం చేశాడు చలమయ్య.

'చేతనైనంత సాయం చేయమని నేనే చెప్పాను. స్వార్థం నేర్పితే తప్పు కాని, సాయ పడు అని చెప్పడంలో తప్పులేదు కదా! ఉన్నంతలో ఇతరులకు సాయపడడం కూడా మానవధర్మమే,' అన్నాడు శరభయ్య.

ఎవరి వెర్రి వారికి ఆనందం అనుకొన్న చలమయ్య, నీతులు చెప్పిన శరభయ్యపై మాత్రం ద్వేషం పెంచుకున్నాడు. అప్పటి



నుండి శరభయ్యతో మాటలు కూడా తగ్గిం చుకున్నాడు. సుబ్బరాజుతో స్నేహం వీడ మని సాంబడికి చెప్పాడు కూడా.

పిల్లలు పెరిగి పెద్దయ్యారు. చదువు పూర్తి చేసుకున్న సుబ్బరాజుకి దూరప్రాం తంలో ఉద్యోగం వచ్చింది. వృద్ధాప్యం దగ్గర పడటంతో శరభయ్య కూడా ఆ ఊరు విడిచి సుబ్బరాజుతో పాటు వెళ్లిపోయాడు.

సంవత్సరాలు గడిచాయి. సుబ్బరాజు తన సంపాదనలో కొంత భాగాన్ని మంచి కార్యాలకు వినియోగించడానికి మొదట ట్నుంచి దాచి ఉంచడం అలవాటు చేసు కున్నాడు.

తను పుట్టి పెరిగిన ఊరిలో వృద్ధాశ్రమం గురించి జనం చెప్పుకోవడం సుబ్బరాజు చెవిన పడింది.



దాచి ఉంచిన డబ్బును తండ్రిచేతుల మీదుగా వృద్ధాశ్రమానికి విరాళంగా ఇవ్వాలనుకున్నాడు. ఆ విషయాన్ని తండ్రికి చెప్పాడు.

శరభయ్య ఎంతగానో సంతోషించాడు. కన్నతల్లిలా పెంచి పెద్దచేసిన ఊరికి సాయపడడ్డామంటే కన్నతల్లి రుణం తీర్చుకున్నంత తృప్తి కలుగుతుందని కొడుకుతో అన్నాడు.

అనుకున్నదే తడవు సుబ్బరాజు, శరభయ్య తాము పుట్టిన ఊరు చేరుకున్నారు. అక్కడి ఆశ్రమంలో అడుగుపెట్టాక ఆకర్షణీయంగా పూలతోట కనిపించింది. మరొకప్రక్క ఉన్న పండ్లతోటలో కొందరు వృద్ధులు కలిసి తోటపని చేస్తూ కనిపించారు.

శరభయ్యకు పూలతోటవైపు వెళ్లాలనిపించింది. కొడుకును ఆశ్రమ నిర్వాహకులను కలవమని చెప్పి తానొక్కడే పూలతోటలోనికి ప్రవేశించాడు. ఆక్కడ ఒక వృద్ధుడు మొక్కలకు నీరు పోస్తూ విరబూసిన పూలను నిదానంగా ఏరి సజ్జలో వేస్తున్నాడు.

ఆ వయస్సులో వృద్ధుని శ్రద్ధ చూశాక అభినందించాలని అనుకుని 'ఇంత మమకారంతో పిల్లల్ని సాకినట్లు మొక్కల బాగోగులు చూస్తున్నావు. నువ్వు చేస్తున్న సేవ సర్వమానవాళికి చేస్తున్న సేవ వంటిదే. ఆ భగవంతుడు నీకు ఆయురారోగ్యాలు ఇచ్చి మేలు చేస్తాడు,' అంటూ పలకరింపుగా మాట్లాడాడు.

గతంలో పరిచయమైన గొంతు వినిపించడంతో తల ఎత్తి చూశాడు ఆ వృద్ధుడు. అతడిని చూడగానే శరభయ్య ఆశ్చర్యపోయాడు.

'చలమయ్యా నువ్వా!' అంటూ ఆ వృద్ధుడిని పరమానందంతో రెండు చేతులతో ఆలింగనం చేసుకున్నాడు శరభయ్య.

చలమయ్య కూడా అంతే ఆప్యాయతతో ఒదిగిపోయాడు. ఒకరికొకరు కుశల ప్రశ్నలు వేసుకుంటూ సమీపంలో చెట్టు నీడన చేరారు.

'నువ్వేమిటి ఇలా వచ్చావు?' శరభయ్యని అడిగాడు చలమయ్య. శరభయ్య తను వచ్చిన పనిని చెప్పాడు.

'ఒక దాత వస్తున్నాడు, పూలదండ చేయమని నిర్వాహకులు ఈ ఉదయం

చెబితే ఎవరికో అనుకున్నాను. నేను పెంచిన తోటనుండి తయారైన దండ ఇవ్వాళ ఒక నిజమైన అర్హుడిని చేరడం నాకెంతో సంతోషంగా ఉంది,' ఆనందప డుతూ చెప్పాడు చలమయ్య.

'ఇందులో నా గొప్పతనమేమీ లేదు. భగవంతుడు నాచేత ఈ పని చేయిస్తు న్నాడు. కాలక్షేపం కోసం నువ్వు ఎంచుకునే మార్గం బాగుంది. ఇటు వృద్ధులకు సేవ, అటు పూలతోట పెంపకం,' అన్నాడు శర భయ్య.

'నీ మాటలే నన్ను ఈ మార్గంలో నడిపి స్తున్నాయి. గతంలో మనకు ఉన్నదానిలో సాయం చేయడం మానవధర్మమని చెప్పా వుగా! అదే ఆచరిస్తున్నాను ఇప్పుడు నాకు మిగిలింది ఈ శరీరం మాత్రమే గదా!' బొంగురుపోయిన గొంతుతో చెప్పాడు చలమయ్య.

'నీ కుటుంబం ఎక్కడ?' ఓదార్పుగా అడిగాడు శరభయ్య.

'ఏ కొడుకైతే సుఖంగా ఉండాలని ఆశించి స్వార్థం నేర్పానో ఆ స్వార్థమే వాడిలో స్థిరపడి నాకు, నా భార్యకు ఈ వృద్ధాప్యంలో తిండి పెట్టడమే దండగనే భావనను పుట్టిం చింది.

చివరకు ఇంటినుండి బయటకు పంపించేశాడు. పిల్లల పెంపకంలో తల్లి దండ్రుల అనాలోచిత నిర్ణయాలు ఇలాంటి అనర్థాలకు కారణమని తెలుసుకోవడానికి ఇంతకాలం పట్టింది. సాయపడే బుద్ధిని నేర్పించిన నీ పెంపకం నిన్ను ఉన్నత స్థాయిలో ఉంచింది. నీ పెంపకం వలన ఇప్పుడు నాలాంటి వాళ్లకు ఇంత తిండి దొరుకుతోంది,' అంటూ వలవల ఏడ్చాడు చలమయ్య.

'కష్టాలు కొద్దికాలమే ఉంటాయి. నువ్వు కూడా నాతోపాటు వచ్చెయి,' ఆత్మీయంగా పిలిచాడు శరభయ్య.

'మానవధర్మం పాటించేందుకు ఇక్కడే ఉండిపోతాను. అప్పుడప్పుడు చూసిపో,' అంటూ అక్కడి నుంచి వెళ్లిపోయాడు చలమయ్య.






# పాలనా రహస్యం

ముఖ్యమంత్రి మంచి పాలనా దక్షుడు. తన పరిపాలనలో ప్రజాసంక్షేమం, రక్షణ అతి ముఖ్యంగా భావించి, అనేక మంత్రిత్వ శాఖలు ఏర్పాటు చేశాడు. సమర్థులైన అధికారులను తయారు చేయడానికి అనుభవజ్ఞులైన గురువులచే నిర్వహించబడే విద్యాలయాలను కూడా నిర్వహించేవాడు.

ఒక సంవత్సరం రాజ్యంలో ప్రముఖ విద్యాలయం నుండి ఆనందుడు, గోవిందుడు అనే ఇద్దరు యువకులు ప్రభుత్వ ఉద్యోగాలకు ఎంపికయ్యారు. ఇద్దరూ తెలివితేటల్లోనూ, ప్రావీణ్యంలోనూ అత్యధిక ప్రతిభతో పరీక్షలన్నీ ఉత్తీర్ణులయ్యారు. గురువుగారి సిఫార్సుతో ఇద్దరినీ చాలా ముఖ్యమైన అధికారులుగా నియమించారు.

ఇద్దరూ వేర్వేరు పట్టణాలలో ముఖ్య అధికారులుగా నియమించబడ్డారు. కొంత కాలం గడిచాక వారి కార్యనిర్వహణను పరిశీలించి తగిన సలహాల నిచ్చే ఉద్దేశంతో వారి గురువు నారాయణ ముందుగా ఆనందుడు పనిచేసే పట్టణానికి వెళ్లాడు.

ఆనందుడు తన గురువును గౌరవంతో ఆహ్వానించాడు. ఆయనకు అన్ని ఉపచారాలు చేసి తన కార్యాలయానికి తీసుకెళ్లాడు. అక్కడ ఉద్యోగులను, వ్యవహారశైలిని ఆయన నిశితంగా పరిశీలించాడు. ఆనందుడు పనివత్తిడికి లోనవుతున్నట్లు గురువు గమనించాడు. తన క్రింది ఉద్యోగుల పట్ల అసహనానికి గురవడం, ఒక నిర్ణయానికి వచ్చేముందు సందిగ్ధానికి లోనుకావడం కూడా గమనించాడు.

'నీ ఉద్యోగం ఎలా ఉంది నాయనా?' అని అడిగాడు గురువు. 'సిబ్బంది చేతగానితనం వల్ల నాకు చాలా ఇబ్బంది స్వామీ!' అన్నాడు ఆనందుడు.

'సరే, ఈ లోగా ఒకసారి గోవిందుడి

సి.యు.కె.ఎల్. సాయి ప్రశాంతి

కార్యాలయం కూడా పరిశీలించివద్దాం. నువ్వు రా!' అని పిలిచారాయన. గోవిందుడు సహాధ్యాయినీ, గురువునూ పరమ సంతోషంతో స్వాగతించాడు.

గోవిందుడి కార్యాలయంలో పనిచేసే వారందరూ చురుకుగా ఉత్సాహంగా కనిపించారు. గోవిందుడు తనను కలవడానికి వచ్చిన వారితోనూ, తన సిబ్బందితోనూ విసుగు, చిరాకు లేకుండా మాట్లాడటం, పనిలో అలసట చెందకపోవడం అతిథులిద్దరూ గమనించారు.

తిరుగు ప్రయాణంలో ఆనందుడు గురువుగారితో సంభాషిస్తూ వారి అభిప్రాయాన్ని, సూచనలను కోరాడు.

దానికి ఆయన, 'ఆనందా! సమర్థతలో కాని, బుద్ధి బలంలో కాని మీరు ఇద్దరూ సమానులే. కాని పెద్ద పదవి నిర్వహించేటపుడు అధికారి తన సిబ్బంది సమర్థతలను పరిశీలించి అర్హులను వారికి తగిన స్థానంలో నియమించాలి. ప్రతిపని మొదటినుండి చివరివరకూ తానే చేయాలనుకుంటే అది ఎవరికీ సాధ్యం కాదు. సమస్యలు ఎదురైనప్పుడు వాటిని స్వేచ్ఛగా చర్చించే అవకాశం ఆ ఉద్యోగులకు ఉండాలి. నీ పట్ల ఉద్యోగులు భయంతో కూడిన విధేయత, గౌరవం మాత్రమే కలిగి ఉన్నారు. ఆఖరికి ఒక పని తాము నిర్వహించలేమని చెప్పగలిగే స్వేచ్ఛ కూడాలేని అధికారానికి వారు తలవంచడం వల్ల వారికీ, నీకూ కూడా ఇబ్బందులు ఎదురవుతున్నాయి. అదే గోవిందుడి విషయంలో అవసరమైనంత స్వేచ్ఛ, ఆత్మీయత కలిగిన అధికారిగా అతడు తన సిబ్బంది యొక్క మొత్తం సామర్థ్యాన్ని వినియోగించుకోగలుగుతున్నాడు. అతడి పట్ల వారి విధేయత గౌరవం, అభిమానంతో కూడినది. అంతేకాదు. తన వద్ద పనిచేస్తున్న సిబ్బంది మంచి చెడ్డలను గమనిస్తూ, వారికి సహాయం చేసే అధికారి అందరి సహకారాన్ని సులువుగా పొందగలుగుతాడు. ఏ అధికారికయినా ఇదే పరిపాలనా రహస్యం. ఈ మాత్రం విశ్లేషణతో నువ్వు పరిస్థితులను చక్కదిద్దుకోగలవని నా నమ్మకం,' అన్నారు.

ఆనందుడు గురువుగారికి కృతజ్ఞతలు తెలిపి, ఆనందంతో వెనుదిరిగాడు.



# నాకేం పట్టింది!

శ్యామలరావు, విమల దంపతులకు పెళ్లయి చాలా ఏళ్లయింది. విమల చిన్న చిన్న కారణాలతోటే భర్తతో అనేకసార్లు గొడవకు దిగేది. ఆమె దురుసుతనానికి శ్యామలరావు అలవాటు పడిపోయాడు. ఆమె గొడవలను మౌనంగా భరించసాగేడు.

ఒక రోజు వాళ్ల పెళ్లి రోజు. విమల ఈ విషయం గుర్తు చేసినప్పుడు శ్యామలరావు తినుబండారాలు చేయమని చెప్పాడు. విమల అంగీకరించకపోగా, మళ్లీ పాత విషయాలు గుర్తు చేసి గొడవేసుకుంది. పెళ్లయ్యాక తాను పుట్టింటినుంచి ఎన్ని వస్తువులు తీసుకువచ్చిందో, తమ పెళ్లిని తండ్రి ఎంత ఘనంగా జరిపించాడో ఊదరగొడుతూ భర్తను విసిగించింది. సహనం కోల్పోయిన శ్యామలరావు తాను గొడవకు దిగి. పోట్లాటను సమానం చేసేశాడు. ఎలాగోలా వాళ్లిద్దరూ శాంతపడి నిద్రకు ఉపక్రమించారు. కాని ఈ గొడవతో శ్యామలరావులో నిరాశా నిస్పృహలు తారాస్థాయికి చేరుకున్నాయి.

ఆ రాత్రి నిద్రపోతున్న విమల ఇంట్లో శబ్దం వినిపించి మేల్కొంది. ఇంట్లోకి ఎవరో దూరినట్లు పసిగట్టి దొంగతనం జరిగే ప్రమాదముందని శ్యామలరావును తట్టి లేపింది. పగటిపూట గొడవను నిద్రలో కూడా మర్చిపోని శ్యామలరావు, 'నేనెందుకు పట్టించుకోవాలి? ఈ ఇంట్లో ఉన్న వస్తువులన్నీ నీవే కదా. వాటికోసం నేనెందుకు బాధపడాలి?' అంటూ అటుతిరిగి గురక పెట్టి నిద్రపోయాడు. – మహావీర్ నానా





# శిథిలాలయం - 28

(శిఖిముఖీ వాళ్ళు రాత్రివేళ ఒక చిన్న లంకలో విడిది చేశారు. వాళ్ళ పడవలను నీట ముంచ వచ్చిన శిథిలాలయ పూజారి బంటు ఒకడు నాంగ్‌సోమ్ చేత చంపబడ్డాడు. నాలుగు రోజుల ప్రయాణం తరవాత వాళ్ళు వృశ్చికలంక చేరారు. అక్కడ శిఖిముఖీ, విక్రమకేస రులకు పాడుబడ్డ దేవాలయం ఒకటి కనిపించింది. తరవాత-)

గుట్టమీద కనిపించిన పాడుబడ్డ దేవాలయం కేసి శిఖిముఖీ, విక్రమకేసరులు బయలుదేరారు. ఎంతో శ్రమకోర్చి, ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని ఈ వృశ్చిక లంకకు వాళ్ళు చేరారు. శిథిలాలయం తమకు ఇంత సునాయాసంగా కళ్ళబడు తుందని వాళ్ళు కలలో కూడా అనుకోలేదు.

సూర్యాస్తమయమై, నాలుగు వైపులా చీకటి ముసురుకుంటున్న సమయంలో వాళ్ళిద్దరూ దేవాలయాన్ని చేరారు. కాని, ఆలయ ప్రాంగణంలో అడుగుపెడుతూనే వాళ్ళు పొందిన ఆశాభంగం అంతా ఇంతా కాదు. ఆలయం పూర్తిగా శిథిలావస్థలో ఉన్నమాట నిజం. కాని, తాత విక్రమ కేసరి ఊహించినట్లుగా అందులో శిల్పకళా ఖండాలు కాని, స్తంభాలకు బంగారు తొడుగులు గాని ఏమీ లేదు. అంతా వట్టి రాతి కట్టడం. గర్భగుడిలో కాళీదేవీమూర్తిని స్ఫురింపజేసే ఒక రాతి విగ్రహం, ఒక పక్కకు ఒరిగి ఉన్నది. గోడలలో ఉన్న గూళ్ళలో కొన్ని రాతి ప్రతిమలు చెల్లాచెదురుగా పడి ఉన్నవి. ఆలయం ఏదో భూకంపం తాకిడికి గురి అయినట్లుగా శిఖిముఖీ, విక్రమకేసరులకు తోచింది.

దాసరి సుబ్రహ్మణ్యం



'కేసరీ, ఇది మనం వచ్చిన శిథిలాలయంలాగా లేదు. మీ తాతగారు విన్నదీ, మనకు ఇభ్యుజాతివాళ్లు చెప్పిందీ ఎంతో అద్భుత శిల్పంతో ఉన్న ఆలయం కదా?' అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి, శిఖిముఖి మాటకు అవునన్నట్లు తలవూపి, విగ్రహాన్ని సమీపించాడు. అదే సమయంలో ఒక పెద్ద తేలు విగ్రహం వెనకనుంచి గోడవైపుకు చరచరా పాకిపోసాగింది.

అది మామూలు తేళ్లకన్న పదీ పన్నెండింతలు పెద్దదిగా ఉన్నది. విక్రమకేసరి దాన్ని చంపేందుకు కత్తి ఎత్తేంతలో మరి రెండు తేళ్లు విగ్రహం వెనుకనుంచి బయటకు వచ్చినై.

శిఖిముఖి, విక్రమకేసరి చేయి పట్టుకుని 'కేసరీ, వాటిని చంపేందుకు ఒక్కుదుటున లేనిపోని శ్రమపడకు. ఇది వృశ్చిక లంక! ఈ రాక్షసి తేళ్లను చంపదలిస్తే, మనకు మరొక పని చూసుకునేందుకు తీరికే ఉండదు,' అన్నాడు నవ్వుతూ.

'ఆ మాట నిజమే. మనం వీటివాత పడకుండా తప్పుకు తిరగటం ఒక్కటే సరైన మార్గం. సరే, ఇది మనం అనుకున్న శిథిలాలయం కాదు. ఇప్పుడేమిటి చేయటం?' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి తలవంచుకుని ఆలోచిస్తూ దేవాలయం నుంచి బయటకు వచ్చి, చుట్టూ ఉన్న కొండల కేసి ఓసారి తలతిప్పి చూసి, 'మనం అసలు శిథిలాలయాన్ని కనుక్కోవటానికి, ఈ కొండలూ, గుట్టలూ వెతక్క తప్పనిసరిలా ఉన్నది. కాని, ఆ ప్రయత్నంలో మనం పూజారి దుర్మార్గుడి నుంచి ఎలాంటి బెడదా రాకుండా తగు జాగ్రత్తలో ఉండటం అవసరం,' అన్నాడు.

'నాకొక అనుమానం కలుగుతున్నది, శిఖీ! పూజారి మనకన్న ముందే, ఈ వృశ్చికలంక చేరాడు. అందుకు సందేహం లేదు. ఒకవేళ వాడు ఈ సరికే ఆ శిథిలాలయాన్ని కనుక్కుని, అక్కడి అమూల్యమైన వస్తువులను హరించి పారిపోయి ఉండడు కదా?' అన్నాడు కేసరి.

ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, 'అనుమానాలతో, సందేహాలతో మనం బుర్రలు



వేడెక్కించుకోవడం మంచిది కాదు. రేపు సూర్యోదయంతోనే మనం ఈ లంక అంతా శిథిలాలయం కోసం గాలిద్దాం. ఒకవేళ పూజారి మనకా సమయంలో తటస్థపడితే వాడి అంతు చూద్దాం. ఈ సరికే వాడు శిథిలాలయం చేరటం కల్ల,' అన్నాడు.

ఆ తరువాత ఇద్దరూ మౌనంగా పడవల దగ్గిరకు వచ్చి, అక్కడ ఉన్న వాళ్లకు తాము చూసిన శిథిల దేవాలయాన్ని గురించి వివరంగా చెప్పారు.

ఈ లంకలో అలాంటి శిథిలాలయాలు చాలా ఉండవచ్చన్నాడు నాంగ్‌సోమ్ ఒకప్పుడీ లంకలో ఇభ్యుజాతివాళ్లు వేల సంఖ్యలో ఉండేవాళ్లని కులపెద్దలు చెప్పగా విన్నానని అతడు చెప్పాడు.

తరవాత వంట పని ముంగించి, అందరూ భోజనాలు చేశారు. ఆ సరికి బాగా పొద్దు పోయింది. చంద్రకాంతిలో చుట్టూ ఉన్న కొండలూ, మహా వృక్షాలూ మిలమిలా మెరిసిపోతున్నవి. పడవలకు జాంగ్‌లాను కాపలా పెట్టి, అందరూ నిద్రకు ఉపక్రమించారు.

బాగా ఆదమరిచి నిద్రపోతున్న శిఖిముఖి నడి రాత్రివేళ దావుల నేదో చప్పుడై చప్పున తెరిచాడు. జాంగ్‌లా కుంటుతూ మెల్లగా అతణ్ణి సమీపిస్తున్నాడు.

వాడేదో ద్రోహం తలపెట్టాడన్న ఆలోచన శిఖిముఖి మెదడులో మెరుపులా కదిలింది. ఆ వెంటనే అతడు పక్కన ఉన్న కత్తిని చేతికి తీసుకుని, అదాటున లేచి నిలబడ్డాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం నిర్విణ్ణుడై, అంతలోనే స్థిమితపడి, 'శిఖి దొరా! నేను దొంగలా మిమ్మల్ని చంపటానికి వచ్చానను కుంటున్నారా? ఇంకా నన్ను తమురు నమ్మలేదన్నమాట. నేను వచ్చింది, తమను అపాయం రాబోతున్నదని హెచ్చరించటానికి!' అన్నాడు.

తన తొందపాటుకు శిఖిముఖి కొంచెం సిగ్గుపడి, 'అపాయమా? ఎవరా శత్రువులు? శిథిలాలయ పూజారా?' అని అడిగాడు.

'ఎవరైందీ తెలియటం లేదు. నేలబారున పడుకుని జాగర్తగా వినండి. ఏదో



డప్పుల మోత అస్పష్టంగా వినబడుతు న్నది.. అదుగో, ఇప్పుడు మరింత స్పష్టంగా వినవస్తున్నది!' అంటూ జాంగ్‌లా దాపుల ఉన్న చెట్ల కేసి తల తిప్పాడు.

ఈ సరికి శిఖిముఖికి కూడా ఆ చప్పుళ్లు స్పష్టంగా వినిపించినై. ఆ వెంటనే అతడు విక్రమకేసరీ, తతిమ్మా వాళ్లు కూడా వినే టట్టుగా పెద్ద గొంతుతో, 'శత్రువులు! లేవండి!' అన్నాడు.

విక్రమకేసరితో పాటు అందరూ ఒక్క సారిగా నిద్రమేల్కున్నారు. ఏదో ప్రమాదం రానున్నదని గుర్తిస్తూనే ప్రతి ఒక్కడూ ఆయుధాలు చేతికి తీసుకోబోయారు. కాని అంతలో వాళ్లను అన్ని వైపుల నుంచీ పాతికా ముప్ఫై మంది వికృతాకారులు చుట్టుముట్టారు.

వాళ్లలో ఒకడికి తలమీదనుంచి కళ్లను కప్పి వేస్తూ, తేలు ఆకారం గల టోపీ ఉన్నది. దానికి పొడిచిన నడిరాత్రిలోనూ రంధ్రాల్లోనుంచి వాడి కళ్లు మిలమిలా మెరుస్తున్నవి.

తేలు టోపీ వాడు చేతిలో ఉన్న రాతి గొడ్డలిని పైకెత్తి తన అనుచరులతో, 'నాకు కలలోవృశ్చికమాత కనిపించి చెప్పింది వీళ్లను గురించే! వీళ్ళలో యోగ్యుడైన వాడిని బలియిస్తే, ఏ ప్రమాదం లేకుండా మనం వృశ్చికమాత మందిరంలో ప్రవేశించ వచ్చు,' అన్నాడు.

ఈ వికృతాకారులు వృశ్చికలంకలోని ఆదిమవాసులనీ, ఇప్పటి పరిస్థితుల్లో వాళ్లను ఎదిరించడం చాలా ప్రమాదకర మనీ శిఖిముఖి వెంటనే గ్రహించాడు. విక్రమకేసరితో అతడా మాట అనగానే, అతడు కూడా అందుకు అంగీకరించాడు.

ఈలోపల నాంగ్‌సోమ్, శిఖిముఖిని సమీపించి, 'వీళ్లు మాట్లాడే భాష మా ఇభ్యుజాతివాళ్లు మాట్లాడేదానికి చాలా దగ్గిరగా ఉన్నది,' అన్నాడు.

ఈ మాటలకు నాయకుడు ఆశ్చర్యపడి నట్లు తనవాళ్లకేసి చూసి, నాంగ్‌సోమ్‌తో, 'మేం ఇభ్యుజాతి వాళ్ళమన్నది ఏనాటి మాట! మాది వృశ్చికజాతి, రెండురోజుల క్రితం ఈ లంకలో శిథిలాలయ పూజారి ననేవాడొకడు దిగి, తానూ ఇభ్యుజాతివా



ణ్ణేననీ, శిథిలేశ్వరి ఆలయాన్ని వెతుక్కుంటూ వచ్చాననీ అంటున్నాడు. అతననే శిథిలేశ్వరీ ఆలయం, మేం చెప్పే వృశ్చికమాత మందిరం ఒకటేనని నాకు అనుమానం కలిగింది.

రేపు మిమ్మల్నీ అతడి గుంపులో చేరుస్తాను. అప్పుడు గాని అసలు మీరంతా ఎందుకు ఈ లంకకొచ్చిందీ బయటపడదు. ఎల్లుండి పౌర్ణమినాడు నేను వెర్రి వెలగపండును తిని, భూగర్భంలో ఆ మందిరం ఎక్కడున్నదో కనుక్కొని, మిమ్మల్నందరినీ వృశ్చికమాతకు బలిపెడతాను,' అన్నాడు.

శిఖిముఖి ఏదో మాట్లాడబోయాడు. కాని వృశ్చికజాతి వాళ్ల నాయకుడు అతడి కేసి రాతిగొడ్డలి ఊపి, తన అనుచరులకు, బందీలందర్నీ వెంట తీసుకురమ్మని చెప్పి, ముందు బయలుదేరాడు.

శిఖిముఖీ వాళ్లు చేసేది లేక వాళ్ళవెంట బయలుదేరారు. శిథిలాలయ పూజారి ఈ లంక చేరాడని, ఏదో ఎత్తులు వేసి శిథిలాలయం ఎక్కడ ఉన్నదీ తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడనీ శిఖిముఖికి అర్థమైపోయింది.

వృశ్చికజాతి వాళ్ల నాయకుడు చెప్పేదాన్ని బట్టి, ఆ ఆలయం ఈ లంకలో ఎక్కడో భూగర్భాన కప్పబడి ఉన్నది. వాడనే వెర్రి వెలగపండు సంగతేమిటి?

శిఖిముఖికి కలిగిన ఇలాంటి సంశయమే నాంగ్‌సోమ్‌కు కూడా కలిగింది. అతడు తన పక్కగా నడుస్తున్న ఒక వృశ్చికజాతివాడిని, 'వెర్రివెలగ పండేమిటి? దానికి అంత మహత్తున్నదా? ఎక్కడ దొరుకుతుంది?' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వృశ్చిక జాతివాడు చేయెత్తి, దాపుల ఉన్న రెండు కొండ శిఖరాలను చూపుతూ, 'ఆ వెలగపండు ఉండే చెట్లు నాలుగైదు శిఖరాలు దిగువనున్న చిన్న కొలను ఒడ్డున ఉన్నవి. ఆ పండు తిన్నవాడికి భూగర్భంలో ఎక్కడ ఏమున్నది తెలిసిపోతుంది, అన్నాడు.

ఈ వెర్రి వెలగపండు మహత్తును గురించి నాంగ్‌సోమ్ గోల్‌భరా గ్రామంలో ఇభ్యజాతి పెద్దలు మాట్లాడుకుంటూం

డగా చాలాసార్లు విన్నాడు. ఆ పండు ఒక్క వృశ్చికలంక లోనే దొరుకుతుందనీ, అది తిన్నవాడికి లోకం మరోరకంగా కనబడు తుందని వాళ్లనుకోవడం కూడా అతడికి తెలుసు. కాని, ఈ భూగర్భ రహస్యాలు కనుక్కునే శక్తి దానికున్నదని అతడు మొదటిసారిగా వింటున్నాడు.

ఏదోవిధంగా, ఆ వెర్రివెలగ పండు సంపాయించి, తినగలిగితే శిథిలాలయం కనుక్కోవడం తేలిక అనీ, తమ సమస్య లన్నీ పరిష్కారమైపోతవని, నాంగ్‌సోమ్ ఆలోచించాడు. కాని, ఆ వెలగపండు ఉన్న చోటుకు చేరాలంటే తను వృశ్చిక జాతివాళ్ల కళ్లు కప్పవలసి ఉంటుంది..

నాంగ్‌సోమ్ ఇలా ఆలోచిస్తున్నంతలో, వృశ్చిక జాతివాళ్ల నాయకుడు ఒక కొండ గుహ దగ్గిర ఆగి, పెద్ద గొంతుతో, 'బందీ లందర్నీ ఈ రాత్రికి ఇక్కడే నిద్రపొమ్మ నండి. ఉదయం కాగానే వాళ్లనేంచేయాలో ఆలోచిస్తాను,' అని కొండ గుహల్లోకి పోయాడు.

శిఖిముఖీ వాళ్లు గుహ ముందున్న చెట్ల కింద పడుకున్నారు. వాళ్లను పట్టుకున్న వృశ్చిక జాతివాళ్లు కూడా దగ్గిరలో అక్కడ క్కడా బండరాళ్లకు చేరగిలబడి కునికి పాట్లు పడసాగారు. నాంగ్‌సోమ్‌కు ఇది మంచి అవకాశంగా తోచింది. తాను వెర్రి వెలగపండు కోసం శిఖరం కింద ఉన్న కొలను దగ్గిరకు పోబోతున్నట్లు శిఖిముఖితో చెబుదామనుకున్నాడు.

కాని, ఒకవేళ అందుకతడు అభ్యంతరం తెలుపుతాడేమో అన్న భయం కలిగింది.



ఆ కారణంగా నాంగ్‌సోమ్ పడుకున్న చోటు నుంచి మెల్లిగా లేచి, కొండ శిఖరం దిగువ నున్న కొలను కేసి బయలు దేరాడు.

నాంగ్‌సోమ్ కొలను ప్రాంతాన్ని చేరేస రికి ఒక వృశ్చిక జాతివాడు కొలను పక్క నున్న వెలగచెట్ల కింద అటూ ఇటూ పహారా తిరుగుతున్నాడు.

వాణ్ణి దెబ్బతీయకుండా వెలగపండు సంపాయించడం సాధ్యం కాదని నాంగ్ సోమ్ గ్రహించాడు. ఆ వెంటనే అతడు, ఒక రాతి చాటున దాగి చిన్నగా ఈల వేశాడు.

నాంగ్‌సోమ్ వేసిన ఈల వినబడగానే పహారావాడు, ఎవరక్కడ? అంటూ నాంగ్ సోమ్ దాగి ఉన్న రాతి దగ్గరకు పరిగెత్తుకు వచ్చాడు. నాంగ్‌సోమ్ చప్పున రాతి వెనక నుంచి లేచి, పహారా వాడి ముఖం మీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు.

పహారావాడు కిక్కురుమనకుండా కింద పడిపోయాడు. నాంగ్‌సోమ్ అతడి కాళ్లూ చేతుల్ని ఒక బలమైన చెట్టుతీగతో బంధించి, వాణ్ణి రాతికి ఆనించి కూచోబెట్టి, వేగంగా వెర్రివెలగచెట్ల కేసి పరుగెత్తాడు.

ఒకటి రెండు నిమిషాల్లో వృశ్చికజాతి పహారావాడికి స్పృహవచ్చింది. వాడు వెలగ చెట్ల కేసి తలతిప్పి చూశాడు. వాడికి అటు కేసి పరుగెడుతున్న నాంగ్‌సోమ్ కనిపిం చాడు.

వెంటనే వాడు కట్లు విప్పుకునేందుకు పెనుగులాడసాగాడు. కట్లు తెగలేదు కాని, పక్కనున్న బండరాయి కదిలింది. అది మీదపడుతుందేమో అన్న భయంతో వాడు తన భుజం ఆనించి దాన్ని వెనక్కు తోయ బోయాడు.

బండరాయి స్థానం తప్పి కిందకు దొర్ల సాగింది. దానితో పాటు పహారావాడు కూడా శిఖిముఖి వాళ్లు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు.

(ఇంకా ఉంది)



# మహాదాత

ఒక గ్రామంలో ఒక ధనికుడుండేవాడు. అతను పేదలకు ఎలాటి దానధర్మాలూ చేసి ఎరగడు. పిసినిగొట్టుగా గొప్ప ఖ్యాతి తెచ్చుకున్నాడు.

ఒకసారి ఒక మనిషి ఆయన ఇంటికి వచ్చి ధర్మం అడిగాడు.

'మీదేవూరు?' అని ధనికుడు ఆ మనిషిని అడిగాడు.

'ఈ ఊరే,' అన్నాడా మనిషి.

'అసంభవం. నేను దానధర్మాలు చెయ్యనని ఊళ్లో అందరికీ తెలుసు,' అన్నాడు ధనికుడు.

ఆ గ్రామంలోనే ఒక చెప్పులు కుట్టేవాడు ఉండేవాడు. ఎవరు యాచించినా లేదనకుండా ఇచ్చేవాడు, మహాదాత.

కొంతకాలానికి ధనికుడు మరణించాడు. గ్రామస్తులు అతని శవాన్ని దారి పక్కన పాతేశారు. అతని చావుకు ఎవరూ విచారించలేదు.

చెప్పులు కుట్టేవాడి దగ్గిరికి మామూలు ప్రకారమే బిచ్చగాళ్లు వస్తున్నారు. కాని అతను, నా దగ్గిర ఏముంది ఇవ్వటానికి? అనటం మొదలు పెట్టాడు.

గ్రామపెద్ద అతన్ని పిలిపించి, 'మహాదాత అనిపించుకున్న వాడివి, అకస్మాత్తుగా దానధర్మాలు మానేశావుట, ఏమిటి కారణం?' అని అడిగాడు.

'దానధర్మాలకని నాకు ఆ చచ్చిపోయిన ధనికుడే అంతులేని డబ్బిస్తూ వచ్చాడు. ఆ డబ్బు తనదన్న సంగతి ఎవరితోనూ చెప్పనని నా చేత ప్రమాణం చేయించుకున్నాడు. ఇప్పుడాయన పోయాడు. పేదవాణ్ణి, నేనేమి ఇచ్చేది?' అన్నాడు చెప్పులు కుట్టేవాడు.





# బ్రహ్మ సృష్టి

మరొక పౌర్ణమి వచ్చింది. తాతయ్య పిండా రబోసినట్టున్న వెన్నెలలో పడకకుర్చీలో కూచుని, నస్యం పెద్దపట్టు పట్టి పీల్చి, ఒక శ్లోకం చదివాడు:

''వస్తుషు బ్రహ్మసృష్టేషు
స్థావరేషు చరేషుచ
సఫలం దృశ్యతే సర్వం
విఫలం నైవ దృశ్యతే.''

చుట్టూ కూచున్న పిల్లలు, 'ఆ శ్లోకానికి అర్థమేమిటి, తాతయ్యా? అని ఏక కంఠంగా అడిగారు.

'ఆ శ్లోకానికి అర్థం చెప్పమంటున్నారా? వినండి. బ్రహ్మదేవుడు సృష్టిచేసిన వస్తువులలో కదిలేవీ, కదలనివీ ఎన్నో ఉన్నాయి గదా, వీటిల్లో వృధా అయినది ఒక్కటిన్నీ లేదు. ఏదో ఒక విధంగా అన్నీ ఇవి ఉపయోగం గలవేనూ అని ఆ శ్లోకానికి అర్థం,' అన్నాడు తాతయ్య నిండుగా నవ్వుతూ.

'ఈ సంగతి మీకు ఎవరు చెప్పారు, తాతయ్యా? ఏదన్నా కథ చెప్పండి, తాతయ్యా?' అన్నారు పిల్లలు.

'ఇంకో కథ దేనికీ? ఈ విషయం గురించే కథ చెబుతాను వినండి,' అంటూ తాతయ్య ఇలా చెప్పాడు:

వెనకటికి అంగపాలుడనే రాజు అంగ దేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయన ఏం చేశాడో తెలుసా? సృష్టిలో ఉపయోగకరమైనవేవి, పనికిమాలినవి ఏవి అని చాలా కాలం దీర్ఘంగా పరిశోధనలు చేశాడు.

చివరకు అతడు ఏం తేల్చుకున్నాడంటే, సృష్టిలో దోమలూ, సాలీళ్లూ తప్ప మిగిలినవన్నీ ఏదో ఒక విధంగా ప్రపంచానికి ఉపయోగపడేవేనూ అని నిశ్చయించుకున్నాడు.

సి.శేషాద్రి

ఇంకేముందీ? అది మొదలు ఆయన తన రాజ్యంలో ఎక్కడ దోమలున్నా, ఎక్కడ సాలీళ్ళున్నా చంపెయ్యవలసిందని, తన సైనికులకూ ఉద్యోగస్థులకూ ఉత్తరువులిచ్చాడు.

ఇది రాజ్యంలోని ప్రజలకు కూడా బాగానే ఉన్నట్లు తోచింది.

అందుచేత వారు రాజుగారి చర్య చూసి చాలా సంతోషించారు.

ఇంతలో ఏమయిందనుకున్నారు? హఠాత్తుగా అంగదేశం పైకి శత్రువులు వచ్చి పడ్డారు. అంగపాలుడు యుద్ధానికి సిద్ధంగా లేనందువల్ల అతడు కొద్దిమంది నమ్మకస్తులైన సేవకులను వెంటబెట్టుకుని అడవుల్లోకి పారిపోయారు.

ఆ రాత్రి రాజూ, సేవకులూ అడవిలోనే పడుకుని నిద్రపోయారు.

కాని ఒక రాత్రివేళ దోమలు వారిని కుట్టి నిద్రలేపాయి.

ఇదీ ఒకందుకు మేలే అయింది. ఏమంటే రాజును వెతుకుతూ శత్రువులు అడవి అంతా గాలిస్తున్నారు.

ఆ అలికిడి విని రాజు, అక్కడ ఉండటం ప్రమాదమని గ్రహించి అప్పటి కప్పుడే తన సేవకులతో సహా బయలుదేరి చాలా దూరం వెళ్లి అక్కడ ఒక కొండ గుహలో దాక్కున్నాడు.

తెల్లవారేసరికి శత్రువులు రాజును వెతుక్కుంటూ ఆ గుహదగ్గరికి వచ్చారు. అయితే సాలీళ్లు ఆ గుహకు అడ్డంగా గూడు అల్లిన కారణం చేత అందులో ఎవరూ ఉండి ఉండరనుకుని భావించి వారు వెళ్ళిపోయారు.

అప్పుడు అంగపాలుడికి తన తప్పు తెలిసివచ్చింది.

దోమలు తనను నిద్రలేపి శత్రుభయం ఉన్నదని తెలుసుకోవడానికి ఎంతో ఉపయోగపడ్డాయి. సాలీళ్లు సాక్షాత్తూ అతడి ప్రాణాలనే కాపాడాయి.

ఇందువల్ల సృష్టిలో పనికిరానిదంటూ లేనే లేదని రుజువయింది గదా? అన్నాడు తాతయ్య.






# మంచి నాన్నగారు

ఓ సాయంత్రం రామారావు తన ఇద్దరి పిల్లల కోరిక మేరకు వారిని నగరానికి తీసుకొచ్చాడు. వారికి ఇష్టమైన తినుబండారాలు కొనిచ్చి ఇంకా పిల్లలకు అవసరమైనవి కొనుగోలు చేసి తర్వాత ఇంటికి బయలుదేరాడు.

కొద్ది దూరమొచ్చాక బండి వెనుక చక్రానికి చిల్లుపడి గాలి పూర్తిగా పోయింది. 'అయ్యో! ఈ రాత్రి వేళ పిల్లల్ని పది మైళ్ల దూరం నడిపించుకుపోవాలి. ఇప్పుడు దుకాణాలు అన్నీ మూసివేసే సమయం..' అనుకుంటూ పిల్లల్ని, బండిని నడిపించుకుంటూ వస్తుండగా కొద్దిదూరంలోనే ఓ దుకాణం కనిపించింది. గబగబా వెళ్లి మరమ్మతుదారుని పట్టుకుని అతడికి బండి వెనుక చక్రాన్ని చూపించాడు. రాత్రి పూట మరమ్మతు అంటే ఓ పది రూపాయలు అదనంగా వసూలు చేసుకోవచ్చన్న ఉద్దేశంతో అతడు 'సరే' అన్నాడు.

దుకాణం వద్ద తన పిల్లలతో కలిసి ఆ ప్రక్కనే ఓ బల్లమీద కూర్చున్నాడు రామారావు. మెకానిక్ వెనుక చక్రాన్ని విప్పి గాలి బూరను బయటికి తీసి చూసేసరికి దాని కవాటం మర పూర్తిగా పాడైపోయినట్టు కనిపించింది. అతడు దాన్ని రామారావుకు చూపిస్తూ, 'ఇది అతికించడానికి పనికిరాదండీ, దీన్ని మార్చి కొత్తది వేయించుకోవాలి,' అన్నాడు.

రామారావు చేసేది లేక 'సరే! మార్చేయండి. కొత్తది వేయాలంటే ఎంతవుతుంది?' అని అడిగాడు.

'కంపెనీదయితే రెండు వందలు అవుతుంది. దాన్ని బిగించినందుకు అదనంగా ముప్పై రూపాయలు కలిపి రెండొందల

మళ్ల లక్ష్మీనారాయణ

ముప్పై అవుతుందండీ,' అన్నాడతడు.

మర్నాడు కార్యాలయానికి వెళ్లాలి కాబట్టి ఇప్పుడే కొత్తది వేయించుకోవడం మంచిదనుకున్న రామారావు, 'సరే, ఏది మంచిది అనిపిస్తే అలానే చేయండి,' అన్నాడు.

అంతలో పిల్లల కోసం కొనుగోళ్లు చేయడంతో తన వద్ద వందరూపాయలు మాత్రమే మిగిలాయి. మరమ్మతుదారును ఉద్దేశించి, 'ఈ దగ్గరలో ఎక్కడైనా ఎ.టి.ఎమ్ ఉందా?' అని అడిగాడు.

'ఆ దారికి ఎదురుగా ఉన్న థియేటర్ పక్కనే ఉందండీ,' చెప్పాడతడు.

'సరే ఈలోగా బండిని సిద్ధం చేసి ఉంచండి' అంటూ పిల్లల్ని తీసుకుని ఎ.టి.ఎమ్ వద్దకు వెళ్లాడు రామారావు.

ఓ ఇరవై నిమిషాల తరవాత డబ్బులు తీసుకుని తిరిగి వచ్చాడు రామారావు.

మరమ్మతుదారు తనపని పూర్తి చేసి బండిని సిద్ధం చేసి ఉంచాడు.

'మీ బండి సిద్ధంగా ఉందండీ, తీసు కెళ్లిపోవచ్చు,' అన్నాడు. రామారావు అతడికి ఐదొందల రూపాయల కొత్త నోటును ఇచ్చాడు. అతడా నోటును తీసుకుని మిగతా చిల్లర రామారావు చేతికిచ్చాడు.

రామారావు అతడు ఇచ్చిన డబ్బుల్ని లెక్క చేస్తూ 'ఫీజుతో కలిపి ట్యూబ్‌కి ఎంత తీసుకున్నారు,' అని అడిగాడు. మెకానిక్ తడుముకోకుండా 'రెండు వందల ముప్పై రూపాయలండీ,' అన్నాడు.

అపుడు రామారావు లెక్క చెబుతూ,




'నేనిచ్చిన అయిదొందల రూపాయల నుండి రెండొందల ముప్పై మీరు తీసుకుంటే తిరిగి రెండొందల డబ్బై రూపాయలు కదా ఇవ్వాలి. కాని మీరు నాకు ఓ వందరూపాయలు అదనంగా ఇచ్చేశారు,' అంటూ వందరూపాయల కాగితాన్ని అతడి చేతిలో పెట్టాడు.

రామారావు నిజాయితీకి మెకానిక్ నివ్వెరపోయాడు. అతడి చేతినుంచి వందరూపాయల నోటును అందుకుని కృతజ్ఞతలు తెలిపాడు.

అపుడు రామారావు అతడితో, 'మీరు కష్టజీవులు. మీకు నష్టం వస్తుందని తెలిసి కూడ ఈ డబ్బుని నేను ఉంచుకుంటే నాకు భగవంతుడు వేరేమార్గంలో ఇంకా పెద్ద నష్టాన్ని చూపిస్తాడు. మనం నిజా

యితీగా ఉంటే అంతా మంచే జరుగుతుం దన్నది నా సిద్ధాంతం,' అన్నాడు.

మెకానిక్ కళ్లలో నీళ్లు తిరిగాయి. బండిని తీయబోతున్న రామారావుతో, 'మీరేమీ అనుకోకపోతే ఓ ఐదు నిమిషాలు కూర్చోగలరా?' అన్నాడు.

రామారావుకి విషయం అర్థం కాక 'సరే,' అన్నాడు. వెంటనే అతడు వెనుక చక్రాన్ని విప్పి గబగబా చక్రాన్ని తొలగించి తను మొదట తొడిగిన ట్యూబ్‌ని పీకి వేశాడు.

తర్వాత తన దుకాణంలోంచి మరొక ట్యూబ్‌ని తీసి తొడిగి తిరిగి అమర్చి గాలి ఎక్కించాడు. కొద్ది నిమిషాల్లోనే బండిని సిద్ధం చేసి ఇస్తూ, రామారావుతో, 'సార్ మీరు నాకు నష్టం వస్తుందని ఓ వంద రూపాయలు తిరిగి ఇచ్చారు కాని నేను మీకు మొదట స్థానికంగా తయారయిన నాసిరకం ట్యూబ్‌ని వేసి కంపెనీదని చెప్పి ఎక్కువ లాభాన్ని పొందాలని చూశాను. కాని ఈ రోజు మీ మాటలు విన్నాక కూడా మిమ్మల్ని మోసం చేస్తే నా అంతరాత్మ నన్ను ఈ రాత్రికి నిద్రపోనివ్వదు. నన్ను క్షమించండి. ఇపుడు మీకు అసలు ట్యూబ్ వేసి ఇచ్చాను. ఇలా ఎప్పుడూ పొరపాటు చేయనని మాట ఇస్తున్నాను సర్,' అంటూ నిజాయితీగా మెకానిక్‌ని చూసి రామారావు ఆశ్చర్యపోయాడు.

చాలా సంతోషంతో రామారావు బండిని తీసి, 'వస్తాను' అంటూ అతడి భుజం తడుతూ పిల్లల్ని బండిపై కూర్చోబెట్టి ఇంటికి బయలుదేరాడు. తన పిల్లల మొహాల్లో కూడా ఓ చక్కని భావం చోటు చేసుకోవడం గమనించాడు రామారావు.

ఈ సంఘటన తన పిల్లలకు ఓ పాఠం లాగా అనిపించడం రామారావుకి చాలా ఆనందమేసింది. ఎందుకంటే నిజాయితీ విలువ ఎంత గొప్పదో మన చేతల ద్వారా పిల్లలకి నేర్పడానికి ఇదొక గొప్ప అవకాశం అనుకుంటూ పిల్లల మనస్సుల్లో కూడా మంచి నాన్నగారు అనిపించుకున్నాడు రామారావు.



# కెరీర్ అంటే?

జంతువులు, పక్షుల సంరక్షణ గురించి మీకు ఆసక్తి ఉన్నట్లయితే, ఈ కథనం మీకోసమే. పెంపుడు జంతువులకు సంబంధించి ముఖ్యమైన అంశం ఏమంటే సరిగా ఎలా ప్రవర్తించాలో వాటికి శిక్షణ ఇచ్చి నేర్పించడమే. తగిన శిక్షణ పొందిన పెంపుడు జంతువు యజమానిని సంతోషపెడుతుంది. జంతు శిక్షణ అనేది సాపేక్షికంగా మనకు కొత్త విషయం. ఇది ఎన్నో అవకాశాలను కల్పించే వర్ధమాన వృత్తులలో ఒకటి.



జంతు శిక్షణ అనేది ఒక సేవా వృత్తి. ఈ వృత్తిలో ఉంటున్నవారు పెంపుడు జంతువుల యజమానులతో వ్యవహరించాల్సి ఉంటుంది. ఈ వృత్తిలో ఉన్నవారు పైకి జంతువులతో వ్యవహరిస్తున్నట్లు కనిపించినా, ప్రధానంగా వీరు మనుషులతో వ్యవహరిస్తుంటారు. ఈ వృత్తి పట్ల ప్రగాఢమైన అనురక్తి కలిగిన వారే దీన్ని చేపట్టాలి. ఈరోజు ఈ వృత్తిలో శిక్షకులు తమకు తాముగా విద్య గడించిన వారే. అంటే వీరు విస్తృతంగా జంతువుల ప్రవర్తన తీరు తెన్నులను, మనస్తత్వాన్ని అధ్యయనం చేసి ఉంటారు. జంతు శిక్షణ సెమినార్లకు, వర్క్ షాపులకు, సదస్సులకు హాజరై ఉంటారు. ఇతర జంతు శిక్షకులతో చర్చించి ఉంటారు.

ముందుగా, అన్నిరకాల జంతువులను, పక్షులను ప్రేమించడం చాలా ముఖ్యమైనది. వివిధరకాల జంతువులతో వాటి అలవాట్లతో, వాటి దుడుకు చర్యలతో వీరికి పరిచయం ఉండాలి. విభిన్న రకాల వ్యక్తులతో వ్యవహరించగల సామర్థ్యం వీరికుండాలి. పరిస్థితిని అర్థం చేసుకుని దానికనుగుణంగా పనిచేయాలి. వీరికి సహనం, స్వీయనియంత్రణ ఉండాలి. ఈ వృత్తి పట్ల విస్తృత జ్ఞానం, నేర్చుకోవడానికి ఆసక్తి అనేవి మంచి జంతు శిక్షకుడిగా మారడానికి ముఖ్యమైన గుణాలు. దేశంలో ఏ యూనివర్శిటీలోనూ ప్రస్తుతానికి జంతు శిక్షణపై డిగ్రీ కోర్సులు నిర్వహించడం లేదు. అయితే ప్రవర్తనా మనస్తత్వ శాస్త్రం, పశువైద్య శాస్త్రం, మానవ ప్రవర్తనా శాస్త్రం వంటివి ఈ రంగంలో వృత్తి శిక్షణ పొందాలనుకుంటున్న వ్యక్తులకు ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి.

చాలామంది జంతు శిక్షకులు స్వయం ఉపాధిని కలిగి ఉంటున్నారు లేదా చిన్న సంస్థల తరపున పనిచేస్తుంటారు. కొన్నిసార్లు, ఇతర జంతు సంబంధ సంస్థలు కూడా శిక్షకులను నియమిస్తుంటాయి. అంటే పశువైద్యులు, షెల్టర్లు, జంతు పనివాళ్లు, జంతుసామగ్రి స్టోర్లు వంటివి. కొన్ని సార్లు స్థానిక నగర లేదా వినోద విభాగాలు, క్లబ్‌లు లేదా ఇతర కమ్యూనిటీ బృందాలు కూడా శిక్షకులను నియమించుకుంటారు. ప్రత్యేకించి శునక శిక్షకులు పూర్తి కాలం ఉద్యోగాలలో చేరుతుండగా చాలామంది తాత్కాలిక ప్రాతిపదికన పనిచేస్తుంటారు. ప్రాంతం మరియు జంతు యజమానులపై ఆధారపడి శిక్షకులకు చక్కటి వేతనం లభిస్తుంది. వృత్తి నైపుణ్యం లేదా అనుభవం సాధించిన తర్వాత ప్రజలు స్వంతంగా వ్యాపారం ప్రారంభించవచ్చు కూడా.

– సాయి

# చందమామ విజయగాథ

ఈ జూలై నెలతో చందమామ 66వ సంవత్సరంలోకి అడుగుపెడుతోంది. అలనాటి ఉజ్వల గతాన్ని గుర్తు చేసుకుంటూ, 1947 జూలై నెలలో ప్రచురించబడిన చందమామ తొలి ముఖచిత్రాన్ని మళ్లీ మీముందుకు తీసుకువస్తున్నాము. నాటి ముఖచిత్రంలో ప్రచురించబడిన ఆరణాల పత్రిక ధరను కూడా మీరు చూడవచ్చు. కథలను ఇంపుగా చెప్పడం ద్వారా మన దేశపు సంస్కృతి, వారసత్వాన్ని భారతీయ చిన్నారులకు అందించాలనే గొప్ప ఆలోచనతో శ్రీ చక్రపాణి, శ్రీ నాగిరెడ్డి గార్లు చందమామ పిల్లల పత్రికను తీసుకొచ్చారు. అప్పటి మద్రాస్ ప్రెసిడెన్సీలో విస్తృతంగా వ్యవహారంలో ఉన్న రెండు భాషలలో (తెలుగు, తమిళం) 1947లో ప్రారంభించబడిన చందమామ తర్వాతి నాలుగేళ్లలోపే ఆరు భాషల్లో ప్రచురించబడింది. ఇప్పుడు చందమామ పత్రికను 12 భాషలలో, ఇంగ్లీషులో కూడా ప్రచురిస్తున్నాము. ఈ వార్షిక సంచికలో మా సంస్థాపకుల ఉన్నతాశయాన్ని మా కర్తవ్యాన్ని మరోసారి మననం చేసుకుంటూ, చందమామ మన సమాజానికి తన వంతు దోహదం అందించేందుకు మరింత కష్టపడి పనిచేస్తామని ప్రతిన చేస్తున్నాము. భారతీయ చిన్నారులు బాధ్యతాయుత పెద్దలుగా ఎదిగేలా చేయడానికి, తమ సంస్కృతి పట్ల



వారు గర్వించేలా చేయడానికి శతథా కృషి చేస్తామని చెబుతున్నాము. భారతదేశంలో ప్రతి కుటుంబంలోనూ పెద్దలు మరో ఆలోచన లేకుండా చందమామ పత్రికను తమ పిల్లల చేతిలో పెట్టగలిగేటంత నమ్మకాన్ని వారిలో కలిగిస్తామని, మేం పిల్లల ఎదుగుదలకు నిజమైన మిత్రులమని నిరూపించుకుంటామని మాట ఇస్తున్నాము.

ఈ మహా సామ్రాజ్యం ఎలా నిర్మించబడిందో తెలిపే కొన్ని చిత్రాలను పాఠకులతో పంచుకుంటున్నాము. నాటి చందమామ కార్యాలయం, ప్రెస్, సిబ్బంది గది, పంపిణీ విభాగం వంటి కొన్ని ఫోటోలను మీముందుకు తీసుకొస్తున్నాము. – సౌమ్యా భరద్వాజ్











# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 42

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -**42**అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఆగస్టు నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. అక్టోబర్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారతీయ వస్త్రాలు



1. లక్నోలో సుప్రసిద్ధమైన వస్త్రాల పేరేమిటి?
2. కర్నాటకలో పత్తి పండించే ప్రాంతం ఏది?
3. ఫుల్కారి అనే అల్లికనైపుణ్యానికి పేరొందిన రాష్ట్రం ఏది?
4. భారత్‌లో బంధని ఏ ప్రాంతాల్లో పేరుకెక్కింది?
5. కలంకారీ పని జరిగే రాష్ట్రం ఏది?
6. భారత్ లోని ఏ ప్రాంతంలో ఇకాత్ నేత పని జరుగుతుంది?
7. పైథాని చీరలకు పేరొందిన రాష్ట్రమేది?
8. తమిళనాడులోని ఏ పట్టణం సిల్క్ నగరంగా పేరొందింది?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-39 సమాధానాలు:

1. మిల్కా సింగ్, 2. ధనరాజ్ పిళ్లై, 3. గీత్ సేథీ, 4. ఎస్. రాబిన్‌సన్, 5. కరణం మల్లేశ్వరి, 6. విశ్వనాథ్ ఆనంద్.

*April'12 Winners:* 1. Sivalenka Chandrasekhar, Mehdipatnam, Hyderabad - 500028.
2. Yagnesh Saradchandra Chaphalkar, Pakhal Road, Nasik - 422006.
3. B.K.Anujith, Kulithurai(Post), Kanyakumari(Dist) - 629163.



# నవ్వుల పువ్వులు

పర్యాటకుడు: ఆ పుర్రె ఎవరిది?
అలసిన గైడ్: అదాండీ, జూలియస్ సీజర్ పుర్రె.
పర్యాటకుడు: మరి దాని వెనుక ఉన్న చిన్న పుర్రె ఎవరిది
గైడ్: అదా అండి, చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడు జూలియస్ సీజర్ పుర్రె.





రాము: డాక్టర్లు, నర్సులూ ఎప్పుడూ ముసుగులు ధరిస్తారెందుకు?
సోము: ఎవరైనా తప్పు చేస్తే ఎవరు చేశారో తెలియకుండా ఉండాలని....



ఉపాధ్యాయుడు: మీ కవల సోదరి సరిగ్గా నీ హాలిడే విహారయాత్ర వ్యాసాన్ని పోలినదాన్నే నాకు ఇచ్చిందేమిటి!
జాషువా: అవును టీచర్. నాదీ, తనదీ కూడా ఒకే పిక్నిక్ అండీ.



అమ్మ: తులసీ, నీ ముఖం దేనికి ఎర్రబడింది?
తులసి: పోట్లాటను ఆపేందుకు నేను వీధిలో పరుగెత్తాను.
అమ్మ: నీవు చేసిన పని చాలా మంచిది. ఎవరు పోట్లాడారు?
తులసి: నేను, రాహుల్.



ఫుట్‌బాల్ కోచ్: రాజేష్, నువ్వు ఆట చాలా బాగా ఆడావు
రాజేష్: అయ్యయ్యో సర్, నేను చెత్తగా ఆడానని అనుకుంటున్నాను.
ఫుట్‌బాల్ కోచ్: లేదు లేదు, పరాయి జట్టుకోసం నీవు బాగా ఆడి పెట్టావులే.



రాహుల్ ఇంటికొచ్చాడు. వాహనంలో గంట సమయం వెనుక సీట్లో కూర్చుండిపోవడంతో నీరసంగా ఉందని అమ్మతో చెప్పాడు.

'నీకు ఎదురుగా కూర్చున్న అతడితో నీవు సీటు మార్చుకోవచ్చు గదా,' అడిగింది తల్లి.

'మార్చుకోలేకపోయా,' చెప్పాడు రాహుల్. 'నా ఎదురుగా ఎవరూ కూర్చుని లేరు మరి.'

# శాండ్‌విచ్‌లో ఏముంది?





శాండ్‌విచ్‌లు కొత్త వంటకాలు అనుకుంటున్నారా? క్రీస్తు పూర్వం 1వ శతాబ్దిలోనే యూదు మత నాయకుడైన హిల్లెల్ ఆ కాలంలో పాసోవర్ పండుగ సంబరాల సందర్భంగా ఈస్టర్ గొర్రె మాంసాన్ని, చేదు వనమూలికలను రొట్టె పలకల మధ్య ఉంచి తినే ఆచారాన్ని ప్రారంభించాడు.



జాన్ మోంటాగు, 4వ ఎర్ల్ ఆఫ్ శాండ్‌విచ్ ఈ అద్భుతమైన స్నాక్‌కు పేరు పెట్టిన ఘనత సాధించాడు. పరమ జూదరి అయిన ఇతగాడికి బయటకు వెళ్లి కాస్త భోజనం చేసి రావడానికి కూడా సమయం ఉండేది కాదట. కాబట్టి రెండు రొట్టె ముక్కల మధ్యన మాంసపు ముక్కను ఉంచి పట్టుకురమ్మని అతడు వెయిటర్‌ను ఆదేశించాడట. తన చేతులకు ఎలాంటి జిడ్డు అంటుకోకూడదని అతని ఆలోచన.



ఎర్ల్ ఆఫ్ శాండ్‌విచ్ తదనంతరం శాండ్‌విచ్ అనే పేరు స్థిరపడిపోయింది కాని ఈ వంటకానికి సంబంధించిన మొదటి ఆలోచన ఇతడికి మాత్రమే రాలేదట. మధ్య ప్రాచ్యానికి విహార యాత్రల కోసం వెళ్లినప్పుడు అక్కడ గ్రీకులు, తురుష్కులు వారి పసందైన బ్రెడ్‌లు, శాండ్‌విచ్‌లను ఇతడు చూసాడు. అక్కడే అతడికి పై ఆలోచన వచ్చి దాన్ని ఉపయోగంలో పెట్టాడు.



ముఫ్ఫులెట్టా శాండ్‌విచ్ అనేది ఒక ఇటాలియన్ శాండ్‌విచ్. జంతువుల తొడ, ఇటాలియన్ సలామి, వెన్న, ఆలివ్ సలాడ్ మరియు తాజాగా దంచిన వెల్లుల్లి ముద్దను కలిపి ఈ శాండ్‌విచ్‌ను చేసేవారు. శాండ్‌విచ్ అసలు ఉనికిలోకి ఎలా వచ్చింది? సాంప్రదాయకమైన సిసిలియన్ ఫ్యాషన్‌లో, రైతులు జంతువుల తొడ మాంసాన్ని, వెన్నను, బ్రెడ్‌ను ఒక విడి పాత్రలో ఉంచి పీపాలు, వెదురుబుట్టలపై కూర్చుని ఆరగించేవారట. దుకాణం యజమాని ఈ వంటకోసం ఉద్దేశించిన పదార్థాలన్నింటినీ రెండు బ్రెడ్ ముక్కల మధ్య ఉంచి తన వినియోగదార్లకు వడ్డించేవాడు. ప్రారంభించిన వెంటనే ఈ వంటకం బాగా ప్రాచుర్యంలోకి వచ్చేసింది.



చీజ్ స్టీక్, మాంసం, ఉల్లిపాయలు, వెన్నలను రెండు బ్రెడ్ ముక్కల మధ్య ఉంచి తినే వంటకం. దీనికి పెన్సిల్వేనియాలో చాలా పేరుంది. 1930లో ఇద్దరు సోదరులు వేడి వేడి బన్నులను అమ్మే పనిలో ఉండి విసిగి వేసారి, తమ భోజనంలో ఏదైనా ప్రత్యేకమైన వంటకాన్ని తయారుచేయాలని అనుకున్నారు. వారు మాంసాన్ని, ఉల్లిపాయ ముక్కలను కలిపి ముద్దచేసి తింటూండగా ఆ దారిలో ఒక వాహన చోదకుడు వచ్చాడు. ఈ కొత్త వంటకాన్ని అతడికి వడ్డించిన సోదరులు ఎలా ఉందని అడిగితే అతడు దాన్ని చాలా ఇష్ట పడ్డాడు. వేడి బన్నులకు బదులు వీటినే అమ్మవలసిందిగా అతడు సలహా ఇచ్చాడు.



సుప్రసిద్ధ పాప్ గాయకుడు ఎల్విస్ ప్రీస్లీకి బాగా ఇష్టమైన శాండ్‌విచ్ ఏమిటో మీకు తెలుసా? వేరుశనగ పిండి పందిమాంసం కలిసిన అరటికాయ శాండ్‌విచ్.

ఫిలిప్పే మాథియు ఒక పోలీసువాడికి శాండ్‌విచ్ తయారు చేస్తుండగా ముక్కలు చేయబడిన ఫ్రెంచ్ బ్రెడ్ రోల్ వుడుకుతున్న ఎద్దుమాంసం కల బాణలిలో పొరపాటున పడిపోయింది.మరొకటి చేయడానికి తగిన సమయం లేకపోవడంతో ఆ శాండ్‌విచ్‌నే అతడా పోలీసువాడికి ఇచ్చాడట. పోలీసు ఈ వంటకాన్ని బాగా ఇష్టపడటమే కాకుండా బాణలిలో వేయించిన శాండ్‌విచ్‌లను కొనమని తన స్నేహితులను కూడా ప్రోత్సహించాడట.





చిప్ బట్టీ అనేది బ్రిటన్‌లో ప్రాచుర్యం పొందిన శాండ్‌విచ్. దీంట్లో తెల్ల రొట్టె యొక్క రెండు ముక్కల మధ్య ఫ్రెంచ్ ఫ్రైలు ఉంటాయి.

సబ్‌మెరైన్ శాండ్‌విచ్‌లకు యుఎస్ఎ, కెనడాలో బ్రహ్మాండమైన ఆదరణ ఉంటోంది. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో నావికులను ఆకర్షించేందుకోసం సబ్‌మెరైన్ రూపంలోని శాండ్‌విచ్‌లను బోస్టన్‌లోని ఒక రెస్టారెంట్‌లో తయారు చేసేవారట.అందుకే వీటికి ఈ పేరు పడిపోయింది. దీంట్లో మాంసం, కూరగాయలు, వెన్న, సాస్, ఇతర అనుబంధ పదార్థాలు ఉంటాయి.



భారతీయులకు కూడా తమ స్వంత ఘాటు రుచులతో కూడిన శాండ్‌విచ్‌లు ఉన్నాయి. చికెన్ టిక్కా, టమోటో చట్నీ, పన్నీర్, మామిడికాయ ఊరగాయలు వంటి నోరూరించే వంటకాలు మన స్వంతం. రకరకాల కూరగాయల ముక్కలు, పుదీనా చట్నీతో చేసే బాంబే శాండ్‌విచ్ అంటే జనం పడిచస్తారు కూడా!





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | No tickets available. | The photography is good. |
|---|---|---|
| Telugu | టిక్కెట్లు అందుబాటులో లేవు. | ఫోటోగ్రఫీ బాగుంది. |
| Hindi | टिकट उपलब्ध नहीं थे।<br>టికెట్ ఉపలబ్ద్ నహీ థే. | फ़ोटोग्राफ़ी बहुत अच्छी है।<br>ఫోటోగ్రఫీ బహుత్ అచ్చీ హై. |
| Tamil | அனுமதி சீட்டுகள் இல்லை.<br>అనుమతి సీతుగై ఇల్లయ్. | புகைப்படக் காட்சிகள் நன்றாக இருந்தன.<br>పుగైప్పడ కాచ్చిగల్ నన్రాగ ఇరుంథనా. |
| Bengali | টিকিট ছিল না।<br>టికిట్ చ్ఛిలో నా. | চিত্রগ্রহনটা ভালো।<br>చిత్రోగ్రఫోన్‌టా బాలో. |
| Marathi | तिकिटं उपलब्ध नव्हती.<br>టికెట్ ఉప్‌లబ్ద్ నవ్తి. | छायाचित्रण खूपच सुरेख होतं.<br>ఛాయాచిత్రన్ కుపాచ్ సురెకు హౌత. |
| Kannada | ಟಿಕೆಟ್ ಸಿಗುತ್ತಿಲ್ಲ.<br>టికెట్ సిగుత్తిల్ల. | ಛಾಯಾಗ್ರಹಣ ಚೆನ್ನಾಗಿದೆ.<br>ఛాయాగ్రహణ చెన్నాగిదె. |
| Odia | ଟିକେଟ୍ ମିଳିଲା ନାହିଁ।<br>టికెట్ మిళిలా నాహిన్. | ଫଟୋଗ୍ରାଫି ଖୁବ୍ ସୁନ୍ଦର ହୋଇଛି।<br>ఫోటోగ్రఫీ ఖుబ్ సుందర్ హొయిచ్ఛి. |
| Gujarati | ટિકિટ ઉપલબ્ધ નથી.<br>టికిట ఉపలబ్ధ నతే. | ફોટોગ્રાફી સરસ છે.<br>ఫోటోగ్రఫీ సరస్ ఛ్ఛె. |
| Assamese | কোনো টিকেট নাছিল।<br>కును టికెట్ నాసిల్. | ফটোগ্ৰাফি ভাল আছিল।<br>ఫోటోగ్రఫి భాస్ ఆసిల్. |
| Malayalam | ടിക്കറ്റ് കിട്ടാനില്ല.<br>టికెట్ కిట్టనిల్లా. | ഫോട്ടോഗ്രാഫി നന്നായിരുന്നു.<br>ఫొటొగ్రఫి నన్నయిరున్ను. |
| Santali | ᱴᱤᱠᱤᱴ ᱵᱟᱝ ᱧᱟᱢᱚᱜ ᱠᱟᱱᱟ।<br>టికిట్ బంగ్ నమొగ్ కన. | ᱯᱷᱚᱴᱚ ᱠᱟᱢᱤ ᱫᱚ ᱵᱮᱥ ᱟᱠᱟᱱᱟ।<br>ఫొటొ కమి దొ బెస్ అకన. |
| Sanskrit | चिटिका: न उपलब्धा:।<br>చిటికాః న ఉపలబ్దాః. | चित्रीकरणं सम्यक् आसीत्।<br>చిత్రికరణం సమ్యక్ ఆసీత్. |





| English | The story is ordinary. | Hero's acting is fantastic. |
|---|---|---|
| Telugu | కథ సాదాసీదాగా ఉంది. | హీరో నటన అద్భుతం. |
| Hindi | कहानी साधारण है।<br>కహానీ సాధారణ్ హై. | हीरो का काम अच्छा है।<br>హీరో కా కామ్ అచ్చా హై. |
| Tamil | கதை சுமார்.<br>కథై సుమార్. | கதாநாயகன் அருமையாக நடித்தார்.<br>కథానాయకన్ అరుమియాగ నడిత్తార్. |
| Bengali | গল্পটা মামুলী।<br>గల్పొటా మాములి. | নায়কের অভিনয় অসাধারন।<br>నాయొకర్ అభినయ్ అసాదారణ్. |
| Marathi | कथानक एकदम साधारण होतं.<br>కథనక్ ఎక్‌దమ్ సధరణ్ హొత. | नायकाचा अभिनय अप्रतिम होता.<br>నయకచ అభినయ్ అప్రతిమ్ హొత. |
| Kannada | ಕಥೆ ಸಾಮಾನ್ಯವಾಗಿದೆ.<br>కథె సామాన్యవాగిదె. | ಹೀರೋ ನಟನೆ ಅದ್ಭುತವಾಗಿದೆ.<br>హీరో నటనె అద్భుతవాగిదె. |
| Odia | କାହାଣୀଟି ସାଧାରଣ।<br>కాహానిటి సాషారణ. | ନାୟକଙ୍କର ଅଭିନୟ ଚମତ୍କାର।<br>నాయాకంక అభినయ కమట్కార. |
| Gujarati | વાર્તા સાધારણ છે.<br>వార్తా సాధారణ చ్చె. | નાયકનો અભિનય અદ્ભુત છે.<br>నాయకనొ అభినయ అద్భుత్ చ్ఛె. |
| Assamese | কাহিনীটো সাধাৰণ আছিল।<br>కాహినిటు గ్జాధారణ్ ఆసిల్. | নায়কৰ অভিনয় সুন্দৰ আছিল।<br>నాయకర్ అభినయ్ గ్జుందర్ ఆసిల్. |
| Malayalam | കഥ സാധാരണമായ ഒന്നായിരുന്നു.<br>కథ సాధారణమయ ఒన్నయిరున్ను. | നായകന്റെ അഭിനയം നന്നായിരുന്നു.<br>నయకంటె అభినయమ్ నన్నయిరున్ను. |
| Santali | ᱠᱟᱦᱱᱤ ᱫᱚ ᱡᱟᱜᱟ ᱞᱮᱠᱟᱱᱟ।<br>కాహ్ని దొ జగ లెకన. | ᱦᱤᱨᱚ ᱯᱟᱴ ᱟᱫᱤ ᱵᱮᱥ ᱟᱠᱟᱱᱟ।<br>హీరో పాట్ అది బెస్ అకన. |
| Sanskrit | कथा तु सामान्या आसीत्।<br>కథా తు సామాన్య ఆసిత్. | नायकस्य अभिनय: उत्तम:।<br>నాయకస్య అభినయః ఉత్తమః. |

## దోమలను పారదోలే మిరియాల నూనె



భారత రాజధాని ఢిల్లీకి చెందిన శాస్త్రవేత్త పద్మా వాసు దేవన్ ఆధ్వర్యంలోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ సంస్థ పరిశోధకుల బృందం దోమలను మిరియాల నూనె పారదోలుతున్నట్లు కనుగొన్నది. దోమల లార్వాను కూడా ఇది చంపగలదట. లార్వా అంటే పురుగుల గుడ్లలో పెరిగే రెక్కలు లేని జీవి రూపం. ప్రత్యేకించి మలేరియాను వ్యాప్తి చెందిస్తున్న అనాఫెలెస్ దోమను ఈ మిరియాల నూనె అత్యంత సమర్థవంతంగా ఎదుర్కొంటుందట.

శాస్త్రజ్ఞులు మొదట మెంథా పిపెరిటా అని పిలువబడుతున్న మిరియం మొక్క నుండి నూనె తీసుకున్నారు. ఆ నూనెలో కొంత భాగాన్ని దోమ లార్వాను కలిగి ఉన్న నీటిపై పోశారు. మర్నాడు ఆ నీటిలోని దోమలన్నీ చనిపోయి ఉండటం కనుగొన్నారు. దోమలను తరిమి కొట్టడంలో ఈ నూనెకు గల సామర్థ్యాన్ని పరీక్షించాలని పలువురు వ్యక్తులు నిర్ణయించుకున్నారు. వీళ్లు ఈ నూనెను తమ ఒంటిపై రుద్దుకుని బహిరంగ ప్రదేశంలో పడుకున్నారు. పది మందిలో ఎనిమిది మంది వ్యక్తులు తమకు దోమలేవీ కరవలేదని చెప్పారు.

## రక్తనిధి బ్యాంక్‌ను రూపొందించిన మహిళ



పరప్ప గ్రామానికి చెందిన ఒక మహిళ తీవ్రంగా జబ్బుపడింది. ఆమె ఒంట్లోంచి విపరీతంగా రక్తం కారసాగింది. ఆమెను ఆసుపత్రికి తీసుకుపోవడానికి గ్రామస్తులు వాహనంకోసం తీవ్రంగా ప్రయత్నించారు. ఆసుపత్రి అక్కడికి 40కిలోమీటర్ల దూరంలో ఉంది. ఎట్టకేలకు మహిళ బతికి బయటపడింది. ఆమె బతకడం ఒక అద్భుతమని ఆసుపత్రి వైద్యుడు చెప్పారు. ఎందుకంటే ఆమె అప్పటికే చాలా రక్తం కోల్పోయింది.

ఈ అనుభవం తర్వాత పరప్ప గ్రామ మహిళలు రంగంలోకి దూకారు. పరిస్థితులు తమ చేతుల్లోంచి ఇక జారిపోకుండా చేయాలని వారనుకున్నారు. వారు తమ గ్రామంలో రక్త దాతల సేనను ఏర్పర్చారు. ఈ బృందాన్ని మహిళా రక్తదాతల వేదిక అని పిలిచారు. కేరళలో ఇది మొట్టమొదటి మహిళా రక్తదాతల వేదిక. సాహిత్య సంఘ సమాఖ్య అనే సంస్థ దీన్ని నిర్వహించింది. ఇప్పుడు మహిళా రక్తదాతల వేదికలో 200మంది స్వచ్ఛంద సేవకులు ఉన్నారు. వీరిలో చాలామంది నిరుపేద వ్యవసాయ కార్మికులు, గృహిణులే. ఉత్తర కేరళ కొండ ప్రాంతమంతటా తన కార్యకలాపాలు విస్తరించాలని ప్రస్తుతం ఈ వేదిక పథక రచన చేస్తోంది.

## విదూషకుడు

### బీర్బల్



# పుంజూ - పెట్టా



1. ఒక రోజు అక్బర్ చక్రవర్తి బీర్బల్ గురించి ఆలోచిస్తూ 'అతడు ఎప్పుడు కావాలంటే అప్పుడు నవ్విస్తాడు, చురుగ్గా ఉంటాడు. తనను ఏడ్పించే అవకాశం నేను చేజిక్కించుకుంటే..!'



2. మర్నాడు, బీర్బల్ మినహా కొలువులో ఉన్న అందరినీ పిలిపించాడు. ఒక బుట్ట నిండుగా కోడి గుడ్లు చూపించాడు. 'మీరంతా తలొక గుడ్డు తీసుకుని తోటలోని చెరువులో వాటిని దాచిపెట్టండి.'



3. తర్వాత బీర్బల్ దర్బారులోకి రాగానే, చక్రవర్తి అన్నాడు. 'చెరువులోకి దుమికి గుడ్డు కోసం వెతకండి. మీరు నీతిగా ఉంటే మీకు ఒక గుడ్డు దొరుకుతుంది. తర్వాత దాన్ని నాకు తెచ్చివ్వండి.'



4. సభికులు వెంటనే వరుసగట్టారు. వారు చెరువు వద్దకెళ్ళి తమతోపాటు తలొక గుడ్డూ తీసుకొచ్చారు. 'హుజూర్, నాకో గుడ్డు చిక్కింది!' అన్నాడొకడు. 'నాకూ దొరికింది ప్రభూ,' అన్నాడు మరొకడు.



5. చక్రవర్తి బీర్బల్ కేసి తిరిగి 'వాళ్లు తమ నిజాయితీని నిరూపించుకున్నారు. 'ఇపుడు నీవంతు,' అందరూ నవ్వారు. 'పాపం బీర్బల్, ఖచ్చితంగా ఈసారి నవ్వుల పాలవుతాడు!'



6. రాజు ఎత్తుగడ తెలియని బీర్బల్ నేరుగా వెళ్లి చెరువులో దూకాడు. 'దేవుడా! ఇక్కడ గుడ్డు అన్నదే లేదు. మిగతా వాళ్లందరికీ ఎలా ఒక్కొక్క గుడ్డు దొరికిందో?'



7. బీర్బల్ చెరువులోంచి బయటికి వచ్చాడు. బట్టలు తడిసిపోయాయి. 'ఇప్పుడు నాకర్థమైంది. ఇది చక్రవర్తి జిత్తు తప్ప మరేం కాదు. నేనేంటో తనకు చూపిస్తాను!'




8. బీర్బల్ దుస్తులు మార్చుకుని కోడిపుంజును అనుకరించి, 'కొక్కొరొక్కో' అంటూ సభలోకి అడుగెట్టాడు. అక్బర్ అడిగాడు. 'ఏంటీ పరాచకాలు? నీ గుడ్డు ఏదీ మరి?'



9. 'ప్రభూ! కోడి పుంజు ఎక్కడా గుడ్లు పెట్టలేదు. ఇక్కడ నేనొక్కడినే పుంజును. మిగతావారంతా కోడిపెట్టలు,' అన్నాడు బీర్బల్. మళ్లీ తానే బోల్తా పడ్డట్లుగా చక్రవర్తి గ్రహించాడు.

## చర్మం

మీ చర్మంలో ఏది అతి పెద్ద అవయవమో మీకు తెలుసా? మీ చర్మమే అతి పెద్ద అవయవం. మొత్తం దేహం బరువులో ఇది 16 శాతంగా ఉంటోంది.

చర్మం అనేక ముఖ్యమైన విధులను నిర్వర్తిస్తుంది. ఇది శరీరాన్ని వాతావరణం నుంచి కాపాడుతుంది. చర్మంలో ఉన్న స్వేదరంధ్రాలు అదనపు నీటిని, ఉప్పును తొలగించడం ద్వారా శరీర ఉష్ణోగ్రతను నియంత్రిస్తాయి. చర్మంలో ఒక ముక్కగా ఉన్న మెలనిన్ చర్మపు రంగును నిర్ణయిస్తుంది. ఇది సూర్యుడి అతినీలలోహిత కిరణాలనుండి మన శరీరాన్ని కాపాడుతుంది.

చర్మానికి విశిష్ట గుణముంది. అది తనను తాను సృష్టించుకుంటుంది. గాయపడినప్పుడు చర్మ కణాలు వెంటనే దాని నొప్పి తగ్గించే ప్రయత్నం చేస్తాయి.

# దక్షిణ భారతదేశ ఆలయాలు

ఈనెల మనం దక్షిణ భారత ఆలయాలతో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము.



రామేశ్వరం, తమిళనాడు



తంజావూర్ దేవాలయం, తమిళనాడు



గోమటేశ్వర ఆలయం, కర్నాటక



తిరుపతి దేవాలయం, ఆంధ్రప్రదేశ్



బసవన గుడి, కర్నాటక



చొట్టనిక్కార ఆలయం, కేరళ

